## సమర్పణ :

ఆంధ్ర రాష్ట్రావతరణమునకు సర్వ
విధముల పాటుపడిన నాయకు
లకు, త్యాగమూర్తులకు—

## వినతి :

అర్థించినంతనే తమకు స్వామ్యముగల
రచనల నీ 'ఆంధ్రవాణి' యందు ప్రచు
రించుకొన ననుమతి నొసంగిన సహృద
యు లెల్లరకు—

ఆదర్శ విద్యామండలి, తెనాలి
ప్రకాశకులు

భారతీ ప్రెస్, తెనా

# విజ్ఞప్తి

ఆంధ్రుల చిరకాలవాంఛ తీరినది. ఆంధ్రరాష్ట్ర మవతరించినది. ఈ నవ్యాంధ్రరాష్ట్రమున నాంధ్ర సంస్కృతితోఁబాటు సారస్వతమున కును నూతన వికాస మావశ్యకము. ఆ తలంపుతో నవతరించిన దే ఈ వాచకము.

కాలమొక యనంతవాహిని. దాని గతి కడ్డులేదు. ఆ కాల వాహిని కనుగుణముగా రూపొందుచుండును సమస్త వ్యవస్థలును. ఆ తీరున దిద్దఁబడునవే నూతన విద్యాప్రణాళికలు. అవి భావిపౌరులను తీర్చి దిద్దుకొనఁగలుగు ననుట సత్యము.

నేఁటి నూతన విద్యాప్రణాళికను, ఆచార్యాంతేవాసుల చిత్త వృత్తులను, పరిస్థితులను నెదుట నుంచుకొని కూర్పంబడినవి ఈ వాచక ప్రథమ, ద్వితీయభాగములు. యస్. యస్. యల్. సి. తరగతియందుఁ బ్రవేశించి ప్రభుత్వపు పరీక్షయందు నెగ్గవలసిన విద్యార్థు లకు సోపానప్రాయములుగ నుండ ననువుగాఁ గూర్పఁబడిన వీ వాచక ములు. వీనిమూలమున విద్యార్థి లోకమునకు రచనా శక్తియు, కల్పనాశక్తియు, కావ్య రసాస్వాదనానురక్తియుఁ బెంపొందు నని నమ్ముచున్నాము. అట్టి తలంపుతోడఁ గూర్పఁబడినవే వీనిలోని యభ్యాసములు.

మా యీ యత్నమును మన్నించి సహృదయులగు విద్యాశాఖ వారును, అధికారవర్గమువారును, నుపాధ్యాయులును, విద్యార్థులును సర్వవిధముల మమ్ముఁ బ్రోత్సహింపఁ బ్రార్థన.

ప్రకాశకులు

# అనుక్రమణిక

## పద్యభాగము



## గద్యభాగము

# నాలుగవ ఫారము
## ప్రత్యేక పఠనము

---

## ప ద్య భా గ ము

# ౧. గర్వభంగము

### తిక్కన సోమయాజి

ఈ భాగము శ్రీమదాంధ్రమహాభారతము నందలి యుద్యోగపర్వములోని తృతీయాశ్వాసము లోనిది.

భరత వంశజుల చరిత్రముతోఁ బాటు భారతీయ విజ్ఞానమును బ్రదర్శించు నితిహాసగ్రంథము మహాభారతము. దీనిని సంస్కృతమున వ్యాసభట్టారకుఁడు రచించెను. వ్యాసభారతము 'కవిత్రయము'చే నాంధ్రీకరింపఁబడెను.

కవిత్రయమునందు ద్వితీయుఁడైనను ప్రతిభావిశేషముచే నద్వితీయుఁడైన వాఁడు తిక్కనసోమయాజి. ఈయన పదుమూఁడవ శతాబ్దపూర్వభాగమున నెల్లూరి మండలము నేలిన మనుమసిద్ధిభూపాలు నాస్థానమునఁ గవియు మహామంత్రియునై యుండెను. ఈయన ఆంధ్రమహాభారతమున విరాటపర్వమునుండి స్వర్గారోహణ పర్వమువఱకును గల పదునేను పర్వములను రచించెను.

తిక్కనకు 'కవిబ్రహ్మ' యనియు 'ఉభయ కవిమిత్రుఁ'డనియు బిరుదములు గలవు. ఈయన నిర్వచనోత్తర రామాయణము, విజయసేనము నను గ్రంథములను గూడ రచించెను.

శ్రీకృష్ణుఁడు పాండవ పక్షమునఁ గౌరవసభకు రాయబారిగా వచ్చినపుడు కణ్వమహర్షి సుయోధనునకుఁ గర్తవ్య ముపదేశించుచు నెంతవారికిఁగాని గర్వము తగదనుటకుఁ దార్కాణముగా నీ కథను జెప్పెను.

సీ. అమరేంద్ర రథసూతుఁడైన మాతలి తన
సుతగుణకేశికిఁ బతిఁ దగంగ
నారసి యార్యకుండను భుజంగాధిపు
మనుమని జికురునితనయు సుముఖు

నర్థిమైఁ గోరిన నార్యకుం దమ్మాలి
కంబుతో నిట్లను గరుడుఁ డితని
తండ్రి వధించి యెంతయు నల్కమై వీని
నింకిట నెల సమయించువాఁడు
ఆ. గానఁ బూనిపోయెఁ గావున నే మియ్య
కొనఁగ నేరమనిన విని బలారి
నడిగి పడసి యుత్తు నాయువు రండని
వారిఁగొనుచు నరిగె సారథియును. 1

వ. వారల భాగ్యంబున నప్పు డింద్రుండును నుపేంద్రుండును నొక్కచో నుండం గని మాతలి యక్కార్యంబు విన్నవించినఁ గరుణించి జిష్ణుండు విష్ణునకుఁ జెప్పి చేయించువాఁడై వైనతేయు దెసకుఁ దాన చాలి సుముఖుం జిరాయురుపేతుం జేసిన. 2

క. మాతలి పాణిగ్రహణం
బాతనిఁ జేయించి యున్న నంతయు విని తా
నేతెంచి గరుడుఁ డతి కో
పాతురుఁడై రేఁగి పెలుచ నమరాధిపుతోన్. 3

వ. వాసుదేవుసన్నిధి నిట్లనియె. 4

క."విను నీ వదితి సుతుండవు
వినత కొడుక నేను విజ్ఞపిఁగెను మనకున్
జనకుఁడు కశ్యపుఁ డొక్కఁడ
దనుజుల శోధించి చంపుదమ యిరువురమున్. 5

క. ఏమిట నీకేఁ దక్కువ
నామేరకు నష్టపడితి" నావుడు నింద్రుం
"డీ మహనీయ మహిమమును
ధామము విష్ణుండు గాక తక్కొరుఁ డగునే." 6

వ. అనినఁ గటకటంబడి గరుత్మంతుండు. 7

ఉ."తమ్ముండ, నీవు నాకొలఁది తథ్య మెఱుంగక నాదు నీచ భా
వమ్మగు భంగిఁ జేసితివి వాసవ, యుష్మదదితిప్రసూత వం

శమ్మొఖిలకున్ దాల్తు నొక సన్నపుఱెక్కన యిట్టి నన్నె నీ
విమ్మెయిఁ దూలపుత్తె" యని యాకులరోషముఁ గొంపెలర్పఁగన్. 8

వ. ఉన్నంత గనుఁగొని కోపించి వాసుదేవుఁడు వెఱనవ్వు నవ్వుచు. 9

క. "నీవేటి మోపుకాఁడవు
నా వెరవున నిన్ను నడపినను గర్వం బే
లా వెఱఁగ!" యంచుఁ దనముం
జే పీఁపున నిడ సురేంద్రజిత్తు వికలుఁడై. 10

క. ఎఱకలు విచ్చుచుఁ దుండము
తెరచుచు వేఁగఁ గఱచి సొగసి త్రెళ్ళి వివశుఁడై
యొఱచిన నొడకుమని హరి
నెఱి సక్కఁగఁ బ్రోచియత్తె నెగయంగఁ గృపన్. 11

వ. ఇవ్విధంబునఁ గేశవుండు కరుణించి గరుడుని ననునయించి "ఇంక నవుదానికి నుద్ధతిమాని బుద్ధిగలిగియుండు" మని పేడ్కఁ బలికి పుచ్చినఁ బోయెం గావున గర్వంబు కొరగాదు. 12

1 అర్థములు:- (1) కుటిలగమనము (వ్యు) వంకరగాఁబోవునది (పాము) (2) జిష్ణుండు (వ్యు) జయశీలుఁడు (ఇంద్రుఁడు.) (3) ధామము=స్థానము (8) కెంపు (నానా) రవ్వ, ఎరుపు. (11) సొగసి=చొక్కి

## 2. ప్రశ్నలు:-

1. మాతలి యార్యకు నేమి కోరెను? దాని కాతఁ డేమనెను?
2. గరుడుఁడు గర్వించిపలికిన పలుకు లేవి?
3. శ్రీహరి గరుడుని గర్వమెట్లు మాపెను?

## 3. రచన:-

(1) గరుడునికి గర్వభంగమైనవిధమును గరుడుని మాటలలో వ్రాయునది.
(2) ఈ పద్యభాగము నొక దృశ్యకావ్య భాగముగఁ జిత్రించునది.

## 4. వ్యాకరణాంశములు:-

అ+కార్యము, వీఁగు+వీఁగు, పన్నము+ఈఁక. పై సంధులను గూర్చి సంధి సూత్రముల గ్రహించునది.

# ౨. అలఘువ్రతము

పింగళి సూరన

ఈ పద్యభాగము పింగళి సూరనచే రచింపఁబడిన కళాపూర్ణోదయములోని యాఱవయాశ్వాసములోనిది.

సూరన ప్రబంధ కవులలో మిగుల వన్నెకెక్కినవాఁడు. ఈతని కళాపూర్ణోదయ మపూర్వ కథాసంవిధానము గలిగి యొప్పారుచున్నది.

సూరన పదునాఱవ శతాబ్ది యుత్తరభాగములోనివాఁడు. ఈయన కళాపూర్ణోదయమునే గాక గారుడ పురాణము, రాఘవ పాండవీయము, ప్రభావతీ ప్రద్యుమ్నము నను గ్రంథములనుగూడ రచించెను. ఈయన కృతులలో వొక్కొక్క కృతియు, వొక్కొక్క ప్రత్యేక గుణముతో విలసిల్లుచుండును.

యజ్ఞశర్మ యను ద్విజుఁడు తనతండ్రియానతిచే నన్నదాన వ్రతమునుబూని యా వ్రతనిర్వహణమునకై, తన సర్వస్వమును వెచ్చించి తుదకుఁ దన భార్యల సొమ్ములనేగాక భార్యలనుగూడ నొక బేహారికి విక్రయించుట ప్రకృత పఠనీయాంశము.

సీ. జననాథ పాండ్యదేశమునందు నురగాఖ్య
పట్టణంబున నొక బ్రాహ్మణుండు
సోమశర్మాఖ్యుఁడు శ్రుతిపారగుండు తపో
యోగాధికుండు శ్రీయుతుండు గలఁడు
తత్త్వజ్ఞుఁడయ్యు నాతఁడు గుప్తమాహాత్మ్యుఁ
డగుచు గృహస్థాశ్రమార్హవిధులు
జగదనుగ్రహార్థముగ నడుపుచు నందు
నతిముఖ్యమని సంతతాన్నదాన
తే. విధిని విప్రులఁదనుపుచు వెలసె, నతని
యాత్మజుఁడు యజ్ఞశర్మాఖ్యుఁ డతనికంట
దయ్యె వేదాదివిద్యల యం దొకటియుఁ
బరమయత్నంబుతో నెన్నిపాట్లు పడిన. 1

క. ఆ దుఃఖము మఱపించుట
కై దివ్యాంగనలఁ బోలు నతివలఁ గులశీ

లాది గుణాఢ్యల నలువుర
నాదరమునఁ బెండ్లిఁజేసె నతనికి గురుఁడున్. 2

క. ఆ కోడండ్రను సొమ్ములు
కోకలు ననులేపనములు కొదయించుకయున్
లేక ప్రవర్తిల నడిపె న
నాకులతం గొమరు డెంద మలరారుటకై. 3

క. కడపటి దెసయుం దాకఁడు
కొడుకుఁ బిలిచి యిట్లులనియెఁ గోడండ్రు వినన్
"నడుమ్పము నీ వెట్లైనను
విడువక మన యన్నదానవిధి నియమంబున్. 4

క. దానను జతురాగమ సం
తానం బుదయించు నీకుఁ దప్పదు మద్వా
చా నియమం బిది" యనుటయుఁ
గానిమ్మని యియ్యకొనియెఁ గడఁక నతండున్. 5

ఉ. ఆయన తండ్రియాజ్ఞఁ దన యాదలఁదాల్చి యొకప్పుడున్ మదిం
బాయక పెంచునట్టి పితృభక్తిపసం గలమాన్నమున్ హవిః
పాయస పూప సూప బహుపక్వ ఫలాదుల నంతకింత కిం
పై యమరంగఁ బెట్టె వసుధామరకోటి కనేక వర్షముల్. 6

చ. పయిఁబయిఁ బండుకొల్పు విరిపైఁడియు గట్టిదినుసు్నరాయి ర
వ్వయు మఱి బంటు బానిసలు బైరము పెయ్యలు చేలు చెట్లు లో
నయిన సమస్త సంపదలు నన్నవితీర్ణికి వెచ్చపెట్టఁగా
బ్రియులు ధరించు సొమ్ములకున్ జెట్టినపెట్టెఁ జలింపకంతటన్. 7

వ. ఇట్లుగడంగి పరమపతివ్రతలం దన సతుల నలువుర నుపలక్షించి. 8

ఉ. ఏ కలకంఠిసొమ్ము హరియింతును మున్నని చింతిలెన్ సమ
స్తోకమనోనురాగత సతుల్ దను నంతట "నాదు సొమ్ము మున్
గైకొను, నాదు సొమ్ము మునుగైకొను" మంచుఁగడంగి వేఁడఁగా
నే కలకంఠిసొమ్ము హరియింతును మున్నని యట్లు చింతిలెన్. 9

వ. అప్పుడు. 10

ఉ. మంగళసూత్ర మొక్కటియె మాని సమస్త విభూషణంబులున్
రంగదభంగురప్రణయరమ్యత నొండొరు మీఱు నూడ్చుచుం
బొంగుచుఁ దెచ్చి ముందటను బోవిడు కాంతలచూపు తొంటికం
టెం గరగించెఁ గాంతుఁ బ్రకటీకృతభక్తియె సొమ్ము సాధ్వికిన్. 11

తే. వెన్నమున్న దానమ్మంట ! వేఁడువాఁడ
ఫకీర్వంకఁట ! తాము పతివ్రతలఁట !
కొండొరుల మీఱి యెట్లు సొమ్ములఁగొటరుదె
జూచి యలంకృతికంటె రమ్యంబుగాదె 12

ఉ. సొమ్ములు వేఁడి పుచ్చుకొనుచోట్ల సపత్నుల మత్సరంబులో
కమ్మున నెచ్చటం గలదు గాని, నిజాభరణంబులెల్లఁ దా
రిమ్మెయి నాథు వెచ్చమున కిచ్చుట కొండొరు మీరు పుణ్యాపుం
గొమ్మలు వీరెయంచు జనకోటి నుతించెను వారి నత్తఱిన్. 13

వ. ఇవ్విధంబునం దమతమ సొమ్ములే మున్ను పుచ్చుకొనుటకుం బ్రకర
ణైక్యంబు గానుపింపం బ్రార్థించు నిజసతులందు నెవ్వారి నతిక్ర
మింపంజాలక యాతం డందఱిం బ్రియంబునం జేకొని తదాభరణంబు
లన్నియు నొకమాఱె పుచ్చుకొని వెచ్చపెట్టందొడంగెఁ దత్కా
లంబున. 14

ఉ. ఏమని చెప్పవచ్చునపు డింతుల సొమ్ములు చెల్లిపోవఁ ద
త్ప్రేమము నెక్కుడం దమువఁ బెట్టెనొ గట్టిగ నిశ్చయించె నా
భామలఁబట్టి యిచ్చి తన పట్టినయట్టి కడిండి నేమముం
దామదిఁ గొన్నినాళ్లు విహితంబుగ నిల్పుకొనన్ మనంబులోన్. 15

వ. ఇట్లు నిశ్చయించి వారికది యెఱింగింపక కపట మార్గంబున సమ్ము
కొను నుపాయంబు చింతించి యొక్కనాఁడు కొమ్మలతో
నిట్లనియె. 16

ఆ. "తామ్రపర్ణిరేవు దండ నోడలు డిగి
యున్నవియఁట యేను నువిదలార !

ఉ. పట్టఁగలేమి కొండొరులఁ బల్మఱుఁ జాలది సంతుఁగొట్టుచున్
దిట్టుచు నీటిలో వలలు తీవ్రరయంబునవైచియున్ గడున్
దిట్టల నీఁతకాండ్ర జడధిన్ బడఁద్రోలియుఁ దజ్జనుల్ గరం
బట్టియెడన్ రయంబు మెఱయన్ వెదకించిరి వారిఁ బల్మఱున్. 25

వ. ఇవ్విధంబునం దడవుగా వెదకి ముదితలఁ గానరారైరి; వారిం
గొన్నట్టి సెట్టి యంతట నవ్విప్రుని బలాత్కారంబున నాక్రమించి
నీ యేడ్పుకతన నింతపుట్టెనని తన్మూల్యధనంబుఁ గ్రమ్మఱంగొని
విడిచిపెట్టె నట్టిపాట్లంబడిన యితండు తనకు సుతులనియెడు
నామాట నమ్మకెట్లాడినను చితెంబ. 26

క. అత్తలిరుఁబోండ్ల యవ్వలి
వృత్తము వినిపింతు నింక వినుమో భూపా
లోత్తమ వారత్తెఱఁగునఁ
దత్తఱపడి నీటనుఱుకు తత్సమయమునన్. 27

క. బలు మీ నొక్కటి నోరన్
సలిలం బెగఁద్రోలుచుండ జనిరా చెలువల్
నలువురు దద్వదనములో
పలి కా సలిలంబు వెంటఁ బార్థివతిలకా! 28

ఉ. అంతన దవ్వుగాఁ బఱచి యంబుచరంబు సయోషపూర్ణవ
క్త్రాంతర తోయ మూర్ధ్వముఖమై ప్రవహింపఁగ మూర్ధరంధ్ర ని
ష్క్రాంతము చేసి తజ్జలము రాజిలె వారుణకేతులీల నా
యింతులు వ్రాల్చిరందు లిఖించిన బంగరుతీఁగలో యనన్. 29

తే. మిగుల దవ్వుగ నెగసియు మగువలంత
నుత్తరంబుగఁ జనుచున్న యొక విమాన
వరము మీఁదటఁ బడి రందు గరిమ జూద
మాడుచును బోవు యువయుగ్మ మరుదుపడఁగ. 30

1. అర్థాదులు:-(1) ఉరగాఖ్య పట్టణము = సర్పపురము. (5) కలమ+అన్నము=మెట్టవరియన్నము. (7) కొల్చు=ధాన్యము. వితీర్ణి=దాత. (15) ఎక్కడం జదువఁబెట్టెనో=ఎట్లు మఱచెనో. నియమము (ప్ర) నేమము (వి) (19) కలంబు=

పడవ. (20) భిదురము=వజ్రాయుధము. (25) దిసంతులుగొట్టుచు = నిందించుచు. (29) సయోషాప్పూర్ణవక్త్రాంతరతోయము = స్త్రీలతోఁగూడి నిండియున్న నోటిలోని నీరు.

## 2. ప్రశ్నలు:–

1. సోమశర్మకుఁ గలిగిన దుఃఖ మేది? ఆ దుఃఖమును మఱపించుట కాతఁ డేమి చేసెను?
2. "కపటపటిమ చెనయం డాతఁడు కొడుకుఁ బిలిచి యిట్టులనియె" ఎవరు? ఏమనెను?
3. "తప్పదు మద్వాచానియమం బిది" ఎవరి వాచానియమము? ఆ వాచానియమ మేమి?
4. యజ్ఞశర్మకు భార్యల సొమ్ములను హరించుటలోఁ గలిగిన సంకట మేమి?
5. "ప్రకటీకృత భక్తియై సొమ్ము సాధ్వికిన్" సందర్భ సహితముగా భావమును వివరింపునది.
6. "జనకోటి నుతించెను వారి సత్త్రజిన్" ఎవరిని? ఏమని నుతించెను?
7. "శోకమహాభిదుర మితని ధైర్యగిరిని బిట్టు పగిల్చెన్" ఏ శోక మెవరి ధైర్యమును బోఁగొట్టెను?
8. "మహారవం బడర నేడ్చెన్ శోక వేగంబునన్" ఎవ్వ రేమని యేడ్చిరి?
9. "జడనిధిలోఁ బడ నుఱికిరి" ఎవరు? ఏల?
10. సముద్రములో పడిన యంగన లెట్లు బయటపడిరి?
11. జలధారలు నుండి యొరయుచున్న యువతు లెట్లుండిరి?

**3. రచన:–** (1) యజ్ఞశర్మ యన్నదానవ్రతమును నెఱపిన విధమును వ్రాయునది. (2) ఆభరణముల నిమ్మపట్ల యజ్ఞశర్మ భార్యలకును, నాతనికిని జరిగిన సంభాషణమును విస్తరించి వ్రాయునది.

**4. వ్యాకరణాంశములు:–** (1) కొడండ్రు, హరియింతును, తలిరుఁబోఁడి, ఈతకాండ్రు, కోరన్ ఈపదములందలి వ్యాకరణ విశేషములను గ్రహించునది. (2) దివ్యాంగనలు, వసుధామరకోటి, పాయసాపూపసూపములు, యువయుగ్మము. ఈపదములకు విగ్రహవాక్యములను గ్రహించునది. (3) బ్రాహ్మణుఁడు, విద్య, సపత్ని, యజ్ఞము, భక్తి, ఇచ్ఛ, ఇంతి, బేహారి- ఈపదములలోఁ బ్రకృతులకు వికృతులను, వికృతులకుఁ బ్రకృతులను గ్రహించునది.

# 3. దశావతారములు

## పూర్వ కవి

హరి యవతార వర్ణనపరము లీ పద్యములు రంగశాయి శతకము లోనివి.

ఈ శతక కర్త పేరుగాని యూరుగాని కాలముగాని సరిగా తెలియుట లేదు. ఐనను నీ శతకము 17 వ శతాబ్దమున రచియింపబడినట్లు తోఁచుచున్నది.

ఈ కవి నిరాడంబరుఁడై తన పేరుకూడఁ జెప్పుకొనకపోయినను, స్తుతిరూపమున స్మరింపఁబడుననే నమ్ముదము.

ఈ శతకమునఁ గవి, శ్రీరంగేశుని స్తుతి పూర్వకముగా విశిష్టాద్వైత మత సిద్ధాంతములను సువ్యక్తపఱచెను. ప్రకృతభాగము రంగశాయి దశావతారముల వర్ణనము.

సామాన్యముగా నూఱు పద్యములుండుటయు, మకుటము నిలుకడయు శతక లక్షణముగా నున్నది. ఈ లక్షణ మీ శతకమునందును పాటింపఁబడినది.

ఈ లక్షణముల నతిక్రమించి వ్రాసిన శతకములు గూడఁ గలవు. వేమన శతకమును దానియందు శతాధిక పద్యములు గలవు. ఏనుఁగు లక్ష్మణకవి రచించిన నీతి శతకాదులందు మకుటము లేదు. సంస్కృత శతకములు మకుట సాంప్రదాయమును పాటించినట్లే కాన్పించదు.

చ. శరచర రూపధారియయి సాగరముద్ధతిఁజొచ్చి సోమకా
సురునివధించి వేదములు చోద్యమొప్పఁగఁ దెచ్చి ధాతకా
వనజునకు నిచ్చి ముజ్జగమువారలఁ బ్రోచినయట్టి కౌస్తుభా
భరణుఁడు రంగశాయి మనపాలఁ గలండు విచారమేటికిన్. 1

చ. ఉరవడి దేవదైత్యులు పయోనిధిఁ ద్రచ్చఁగ మందరాచలం
బరిదిగఁ గ్రుంగ దానిఁ గమఠాకృతి మీఁదికి నెత్తి కూర్మితో
సరయఁగ దేవపంక్తికమృతాన్నముఁ బెట్టినయట్టి కౌస్తుభా
భరణుఁడు రంగశాయి మనపాలఁగలండు విచార మేటికిన్. 2

చ. ధరణిని జుట్టి చంకనిడి దాఁగినయట్టి హిరణ్యనేత్రునిం
గిరి వరమూర్తియై వెదకి గీటడంగించి ధరిత్రిఁ గొమ్మునన్
బరగ ధరించి తొంటిక్రియఁబట్టుగ నిల్పినయట్టి దిట్ట భూ
భరణుఁడు రంగశాయి మనపాలఁ గలండు విచారమేటికిన్ .

ఉ. పొంగుచు నా హిరణ్యకశిపుం నఖపంక్తిని జీఱి, వాని సూ
నుం గరుణించి కాచిన ఘనుండు, ప్రశాంతుఁడు, శ్రీనృసింహమూ
ర్త్యంగుఁడు, భక్తకోటిఁ గృపనారసి ప్రోచు ఘనుండు, సత్కృపా
పాంగుఁడు, రంగశాయి మనపాలఁ గలండు విచారమేటికిన్. 4

ఉ. బేలతనంబునం బలిని గోరినయట్టి పదత్రయంబు నా
పాలికి ముజ్జగంబులని ప్రస్తుతిసేయుచు వచ్చి చయ్యనన్
మేలుగ ధారఁబట్టి బలి మెట్టిన దిట్టగునట్టి పొట్టియా
బాలుఁడు, రంగశాయి మనపాలఁ గలండు విచారమేటికిన్. 5

చ. పరువడిఁ గార్తవీర్య పరిపంథినృపాలు సహస్ర బాహువుల్
తెరఁగునఁ ద్రుంచి క్షత్రియులఁదీవ్రత నిర్వదియొక్కమారు వే
సరక వధించి రాముఁడన సంస్తుతికెక్కిన బాహుశాలి స
ద్వరదుఁడు రంగశాయి మనపాలఁ గలండు విచారమేటికిన్. 6

ఉ. హాళిని దాటకం దునిమి యాగము గాచి యహల్యఁ బ్రోచి సీ
తా లలన న్వరించి రణదర్పిత రావణ కుంభకర్ణ దై
త్యాళిని ద్రుంచి రాజ్యము నయంబుగ నేలిన రామచంద్ర భూ
పాలుఁడు రంగశాయి మనపాలఁ గలండు విచారమేటికిన్. 7

చ. చలమున రాసభాసురునిఁ జంపి, ప్రలంబుని నొంచి, మర్కటున్
ఖలుఁ బొరియించి, శత్రునృపగర్వ మణంచి, మహాత్ము రుక్మినిన్
నలినలిచేసి నాఁగటను నాగపురిన్ బెకలించినట్టి స
త్ఫలదుఁడు రంగశాయి మనపాలఁ గలండు విచారమేటికిన్. 8

ఉ వృద్ధమునీంద్రవేషమును వేసుక దండకమండలంబు చే
బుద్ధియగానఁ బూని పువుబోణుల మెల్లనఁ జేరి వారి స
ద్బుద్ధులు సాఁగఁబుచ్చిన ప్రబుద్ధుండు యోగిజనౌఘమానసో
ద్బుద్ధుఁడు రంగశాయి మనపాలఁగలండు విచారమేటికిన్. 9

చ. అరయుచు లోకముల్ కలియుగాంతమునందు సమస్తపాతకో
త్కరనరులన్ ఖురాగ్రముల ఖండితదేహులఁ జేసి డాసి భీ
కరగతిఁ గల్కిరూపముఁ దగన్ ధరియించి తలిప్రహారుఁడై
పరగెడు రంగశాయి మనపాలఁగలండు విచారమేటికిన్. 10

1. అర్థాదులు:- (1) జలచర -రూప - ధారి=నీటియందు సంచరించు జీవరూపమును ధరించినవాఁడు. శారదావరుఁడు=సరస్వతికి నాథుఁడగు బ్రహ్మ (2) కమఠ+ఆకృతిన్=తాఁబేటి రూపముతో. కమఠము (వ్యు) నీరు నివాసముగా గలది. (కూర్మము) (3) కిరివరమూర్తి=గొప్ప పంది రూపమును దాల్చిన వాఁడు. కొమ్ము (నానా) కోర, పశువుల నెత్తిమీఁది కొమ్ము, కొండకొన. (5) గోలతనంబునన్=అమాయకత్వముతో. ధార (ప్ర) దార (వి) (6) పరిపంథి=శత్రువు. థిరము (ప్ర) తిరము (వి) వేసరక=విసుఁగు చెందక. (7) ఆళి (నానా) సమూహము, పంక్తి, సఖి (8) నాగపురి=హస్తినాపురము. (ఈపద్యమున బలరాముఁడవతారమూర్తిగా వర్ణింపఁబడెను.) (9) ప్రబుద్ధుఁడు=మిగుల జ్ఞానము కలవాఁడు, (ఏవైన గడుసుపనులు చేసినవానిని ప్రబుద్ధుఁడందురు.) (10) ఖుర+అగ్రములన్=గిట్టల చివరలచే.

(2) ప్రశ్నలు:-

1. రంగశాయి మత్స్య, వరాహ, పరశురామావతారములందుఁ జేసినపనులను వివరించునది.

2. శతకములకుఁగల సామాన్య లక్షణములను వివరించి రంగశాయి శతకమునందుఁ గల లక్షణములను నిరూపించునది.

(3) రచన:- (1) దేవదైత్యులు పయోధిని ద్రచ్చుట, కార్తవీర్యుఁడు పరశురామునకుఁ బరిపంథియగుట, రాముఁడు యాగమును గాచుట, బలరాముఁడు నాగపురిని బెకలించుట, బుద్ధదేవుఁడసురకాంతల సద్బుద్ధులసాగనంపుట — వీనియందుఁగల పురాణగాథలను గ్రహించి వ్రాయునది. (2) రంగశాయి (హరి)దశావతారమును దాల్చి యొనరించిన పనులను సొంత మాటలలో వ్రాయునది.

(4) వ్యాకరణాంశములు:- సుజ్జగములు - ప్రస్తుతిసేయుము-వేసుక-కల్కి. వీనియందలి వ్యాకరణకార్యములను గ్రహించునది.

# ౪. ధర్మపరశు

శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు

ఈ ఖండకావ్యము పాపయ్యశాస్త్రిగారిచే రచింపఁబడిన 'ఉదయశ్రీ' యను ఖండకావ్య సంపుటములలోని రెండవ భాగము లోనిది.

శ్రీ శాస్త్రిగారు ప్రస్తుతము గుంటూరు నగరము నందలి యాంధ్రక్రైస్తవ కళాశాలయం దాంధ్రోపాధ్యాయులుగా నున్నారు. వీరు ఉదయశ్రీ, విజయశ్రీ, కరుణశ్రీ, అరుణకిరణాలు మున్నగాఁ గల పెక్కు కావ్యములను రచించి తమ మధురవాక్కులను ప్రజల కందఁజేయుచున్నారు.

సత్త్వమూర్తి యనఁదగినవాఁడు జమదగ్ని మునీంద్రుఁడు. అతని హోమధేనువు 'కామధేనువు'. రాజ్యమదమత్తుఁడు కార్తవీర్యుఁడు. అతఁడు కామధేనువును గోరి మహామునిని వధింపఁజేసి హోమధేనువును గొనిపోయెను. జమదగ్ని బిడ్డ పరశురాముఁడు చిచ్చరపిడుగు. అప్పుడాశ్రమమున లేఁడు. పిదప తండ్రి యవమానము నెఱింగెను. కార్తవీర్యుని వేయి చేతులను తన కుఠారమున నఱికివైచెను. అతని రక్తముతోఁ దన తండ్రికిఁ దర్పణము నొనరించెను. అంతతోఁ దీఱలే దాతని వేడి. రాజవంశముల నన్నిటిని నిరువదియొక్కమారు వెతకి వెతకి వధించెను. క్షాత్త్రధర్మమునే గాక ప్రజాధర్మమును గూడ నెఱవేర్చెను.

ధర్మసంస్థాపనకై పరశువు బూనిన జామదగ్న్యుని రూపము కవి కన్నుల యెదుట నిలిచెను. కావ్యసృష్టి జరిగెను. అదిగో పరశువు ధరించుచున్నాఁడు– వసనము బిగించి, రక్తతిలకమును నుదుట నిడికొని ధర్మపరశువు పూనిన వీరశిఖామణి భార్గవరాముఁడు!

తే. బ్్రహ్మవర్చస్సు చిందు నీ ఫాలతలము
క్షాత్రతేజస్సు చిమ్ము నీ నేత్రయుగళి
భార్గవా! నీవు క్షత్రియ బ్రాహ్మణుఁడవా!
బ్రాహ్మణ క్షత్రియుఁడవా! విభ్రాంతి గలిగె. 1

తే. అలికఫలకమ్ముపయి రక్తతిలకమేమి?
క్రాంతి సంక్రాంతమగు పురోగమనమేమి!
గండ్రగొడ్డలితో భుజాస్కంధమేమి?
విశ్వభీకరమైన ఈ వేషమేమి? 2

తే. ఎవఁడురా వాఁడు! కడిసి కవ్వించినాఁడు
మరచి నిదురించు వీరకేసరిని తట్టి –

ఎవఁడురా వాఁడు ! తలదూర్ప నెంచినాఁడు
అరి భయంకర మృత్యు గహ్వరము గాన. 3

ఉ. ఎక్కడ కీ ప్రయాణము మునీంద్రకుమారక ? జింకచర్మ మే
దిక్కున పారవైచితి వి దేమి కనుంగవ చింత నిప్పులన్
గ్రక్కుచునున్న, దుద్ధతికరమ్మన నూగెడి యీ కుఠార మే
మ్రుక్కడి దానవాధముల మూపుల దూకగ నుత్సహించెరా ? 4

చ. నడుము బిగించి వల్కలమునన్, జడలన్ సిగజుట్టి, కన్బొమల్
ముడివడ, వీరరక్తమిడి మోమున, విప్లవ గర్జనందిశల్
తడబడ, కాలరుద్రుని విధాన కుఠారము చేతబట్టి నీ
వడుగిడ దద్దరిల్లినదిరా ! పృథివీతల మొక్క పెట్టునన్. 5

ఉ. సత్య తపోధనుండవె ! ప్రశాంతుఁడవే ! జమదగ్ని రేణుకా
పత్యమవే ! మహేశ్వరుని భక్తుఁడవే ! మఱి బ్రాహ్మణుఁడవే !
జాత్యనురూప ధర్మగుణ సంపద నెంచక రౌద్రమూర్తివై
హత్యల కిట్లు పాల్పడితివా! మతిపోయినదా భృగూద్వహా ! 6

ఉ. ఇంటికి పిల్చి స్వాగతము నిచ్చి ప్రియంబున విందుసేయుచో
కంటకమయ్యె నా ప్రభువుగారికి - ఆశ్రమ హోమధేనువున్
గెంటుకపోయె క్రౌర్యము చిగిర్చిన వేయికరాలు సాచి - ఈ
కొంటెతనమ్ము రక్తబలి గోరెదె హైహయరాజవంశమున్. 7

ఉ. మాలిమిచేసి యెంత బ్రతిమాలిన గోవు నొసంగనట్టి గొం
డాలకు బుద్ధిసెప్పెదు కుఠారముధాటికి నిల్వలేక గ
గ్గోలయిపోయి రాజుకొడుకుల్ కనుచాటుగ ఆశ్రమంబులో
కాలిడి నీవు లేని తఱి కంఠము కోసిరటే తపోధనున్. 8

చ. "పఱపఱ గొంతుకోసిరి కృపారహితాత్ములు గోలపెట్టి బి
ట్టఱచెడి నన్ను లెక్కగొనరైరి రవంతయు రామ రామ !" యం
చిరువదియొక్క మారు జనయిత్రి యురస్థలి బాదుకొన్నదా
ధాతరిపించదా! నిను రుధిరధారల సంద్రమునమ్మునీద్పఁగన్. 9

ఉ. ఎచ్చోట నేర్చుకొంటివి మునీ! గడిదేరిన రాచవారితో
కయ్యముసేయునేర్పు? మొనగాడవు! కోసితి పూచకోఁత అ
క్షయ్యములయ్యె నీ విజయగాథలు భావిచరిత్రలోన మా
యయ్య! యనుగ్రహించి యికనైనను గొడ్డలి క్రిందపెట్టుమా? 10

ఉ. చిన్నతనంబునన్ శివుని శిష్యుఁడవై రజతాద్రిమీఁద గై
కొన్న మహాప్రయాసమునకున్ ఫలితార్థమిదేనటోయి! ఏ
మన్న నికేమియున్నది మహాబలికాండ సమాప్తమయ్యె - ఇం
కెన్నియుగాల కీ రుధిరమెండునో భారతభూమి గుండెపై! 11

ఉ. దర్పమెలర్ప వైరి వసుధాపతులన్ వధియించి తండ్రికిన్
దర్పణ మాచరించితివె తద్రుధిరమ్ముల, భూమిభారమున్
దీర్పఁగ జన్మమెత్తితివి; దేశము కంటక శూన్యమయ్యె; రా
మార్పణమయ్యె క్షుద్రములు స్వార్థపరత్వ నిరంకుశత్వముల్. 12

ఉ. మే మొకమాట లేము విరమింపుము వీరవిహారయాత్ర నో
స్వామి! భవత్కుఠారము కసాయిమకాణము చేసివైచె నీ
భూమి సమస్తమున్, చెదిరిపోవుచునుండె కనుల్, ప్రచండ తే
జోమహనీయమూర్తి! దయచూడుము! వీడుముదగ్రరూపమున్. 13

తే. ఒక్కముని యేమి యిరువదియొక్కమారు
దర్పఘనులగు నృపుల నదల్చుటేమి!
ఏ మహాశక్తియో పొంగులెత్తి పొరలి
ఉక్కలల్లాడ్చెగాక వేరొక్కఁడగునె! 14

తే. 'గోవు కొట్లాట' కాదిది - దైవబలము
దానవబలమ్ముపై జయధ్వజము నెత్తె -
ఇది ప్రతిక్రియ కాదు దుర్మదనిరంకు
శ ప్రభుత్వముపై ప్రజాశక్తి గెలుపు - 15

తే. ఎవ్వ రేమనుకొన్న నీకేమి? దైవ
శక్తి నీయందుకలదు దీక్షాతపస్వి!
కడుగుకొనుమయ్య! రక్తపంకమ్ము తొలఁగ
నర్మదాతీర్థమందు నీఁ ధర్మపరశు'! 16

1. అర్థాదులు:- (2) అలికఫలము=నుదుటి భాగము. (6) అపత్యము=సంతానము.

2. ప్రశ్నలు:-

1. "భార్గవా .....విభ్రాంతిగలిగె" అట్టి విభ్రాంతి యేలకలిగెను?
2. "మతిపోయినదా భృగూద్వహా" అట్లు మతిపోయినదని తలంచుట కేమి కారణము?
3. "రామార్పణము లయ్యె, క్షుద్రములు స్వార్థపరత్వ నిరంకుశత్వముల్" ఎట్లో వివరించునది?
4. "గోవుల కొట్లాట కాదిది - దైవబలము దానవబలమ్ముపై జయధ్వజము నెత్తె" ఎట్లో చిత్రించునది?

3. రచన:- (1) పరశురాముని రౌద్రరూపమును చిత్రించునది. (2) పరశురాముఁ డొనరించిన భీభత్సమును వివరించునది. (3) కంటకమయ్యెను, గోలయిపోయె, గడిదేరిన, ఊచకోత, రామార్పణము - ఈ నుడుల భావము చెడకుండ స్వీయ వాక్యరచన చేయునది.

4. వ్యాకరణాంశములు:- అలికఫలకము, విశ్వభీకరము, తపోధనుఁడు, వైరివసుధాపతులు, దీక్షాతపస్వి, ఈ సమాసములను విగ్రహ వాక్యములలోఁ గూడ గ్రహించునది.



# నాలుగవ ఫారము

## ప్రత్యేక పఠనము

## గ ద్య భా గ ము

## ౧. వంచనము

పరవస్తు చిన్నయసూరి

ఈ గద్యభాగము నీతిచంద్రిక యందలి మిత్రభేదములోనిది. నీతిచంద్రికను రచించినవారు చిన్నయసూరిగారు. వీరు చాత్తాదవైష్ణవులు. శ్రీపెరుంబుదూరు వీరి జన్మస్థానము. వీరు 1806 సం. జన్మించి 1862 వఱకు జీవించి యుండిరి. వీరి భాషా పటిమ కలరి విశ్వవిద్యాలయమువారు 'సూరి' యను బిరుదము నొసఁగిరి. సూరిగారు బాలవ్యాకరణము, ఆంధ్రపదకోశము మున్నగు పెక్కు గ్రంథములను రచియించిరి.

విష్ణుశర్మ యను పండితుఁడు సంస్కృతమున పంచతంత్ర మను గ్రంథమును రచించి సుదర్శనుఁడను రాజు కొడుకులకు బోధించెను. దాని నాధారముగాఁ జేసి కొని నారాయణ పండితుఁడు 'హితోపదేశ' మను గ్రంథమును గీర్వాణభాషయందే రచించెను. అందు మిత్రలాభ - మిత్రభేద - విగ్రహ - సంధు లను నాలుగు భాగ ములు గలవు. ఆ గ్రంథము ననుసరించి చిన్నయసూరిగారు నీతిచంద్రిక పూర్వఁ భాగమగు మిత్రలాభ - మిత్రభేదములను నాంధ్రవచనరూపమున రచియించిరి పిదప కందుకూరి వీరేశలింగము పంతులుగారు సంధి - విగ్రహములు రెండింటిని వ్రాసి నీతి చంద్రిక యుత్తరభాగమును బూర్తి చేసిరి.

దమనకుఁడను నక్కలరాయఁడు పింగళకుఁడను మృగేంద్రునకును, సంజీవ కుఁడను వృషభేంద్రునకును మైత్రి కలిగించెను. పిదప వారిసఖ్యమును జూచియోర్వఁ జాలక వారికి భేదము గల్పింప యత్నించెను. అపుడు సంజీవకుఁడు రాజద్రోహులగు కాటకపాటకులతో మైత్రిచేయుచున్నాఁడని పింగళకునికిఁ జెప్పి యాతనికలుక పుట్టించెను. కాని పింగళకుఁడు కొంత యోజించి సంజీవకు నెట్లైనను జక్క పఱుపుమని దమనకునిఁ బంపెను.

అప్పుడు దమనకుఁడు సంజీవకుని పాలికేగి ఱేఁడు మిగులఁ గోపించియున్నాఁడని చెప్పి, రాజసేవలోని దోషముల నెన్ని యతనికిఁ బింగళకునిపైఁ గోపము కలిగించెను. అటనుండి పింగళకుని కడకేగి సంజీవకుఁడు తన హితోపదేశమును మన్నింపక యుద్ధమునకు సిద్ధపడివచ్చుచున్నాఁడని చెప్పెను. ఈ విధముగా దమనకుఁడు సంజీవకుని వంచించి రాజాగ్రహమునకు గుఱిసేయుట ప్రకృత భాగమందలి యంశము.

1. నావుడు దమనకుండు వల్లెయని యల్లల్లంజని యాననంబున దీనభావంబు గదురఁ, బదంబులు దొట్రిల డాయం బోవ; సంజీవకుండు గాంచి, ప్రత్యుత్థానంబొనరించి, యుచితాసనంబునం గూర్చుండం జేసి, త – దనుభావంబునకు నిమిత్తంబు మానసంబునం బరికించుచు, "మీ యందఱకుం గుశలంబె?" యనిన దమనకుండు విని, "పరాధీన – వర్తనులకుం గుశలంబున కెంతయంతరంబు? రాజసేవాపరుండు మృత్యు – గ్రస్త – తుల్యుండు తేనిమచ్చిక నచ్చికయిడి పెద్ద కాలంబు సుఖయింపం గాంక్షించువాఁడు మృగతృష్ణికా – ప్రవాహంబుం గాంచి యుదన్యాప నోదనంబుకయి ప్రధావించువాఁడు గాఁడే? ఏకతంబుననేని తేని సాకతంబునకు మోఱకుతీరున ధీరుండు మోసము బొందఁడు." నావిని గోవల్లభుండు, "నీ వచనభంగి విచారింప నేదియో యొక్క విశేషంబు గలుగంబోలునని తోఁచెడు" ననుచు నేకాంత – కాంక్షా-సూచకంబుగం దన యిరుపక్కియలుం బిఱుసక్కియు నాలోకింపఁ, బిఱిందిదెస నున్న కాటక–పాటకు లల్లనలేచి యెడగలుగం బోవుడు, దమనకుండు వారి దెస యపాంగవీక్షణంబున సూచించుచు, "వీరలఁ జేరుచుటయె నీ యిడుమకు మూలం బయ్యె," నావుడు సంజీవకుండు భయాధీన మానసుండయి, "యచ్చట జరిగిన వృత్తాంతం బేమి?" యని యల్లన నడిగిన, దమనకుం డిట్లనియె, "చేటెఱుంగని పాటు వడియెదవు. కాటక – పాటకులు రాజద్రోహులని యెఱింగియుండియు వారలతోడ సఖ్యంబు చేయుచున్నవాఁడవు. ప్రభువునకె కా దెవ్వరికైన నిది యనుచితంబని తోఁపకుండునా? ఈ యర్థంబు పార్థివుం డెఱింగి దుర్వార – క్రోధ – భీషణుండయి యున్నవాఁడు. తొల్లి నా వచనంబునందు విశ్వాసంబిడి తేనిపాలం జేరితివి. కావున

నున్నరూపు వచియించెద వినుము. సంజీవకు పక్షం బవలంబించి మత్సమ్ముఖంబున వర్తియించు వారి నెవ్వరినేనిం దక్షణంబ కృతాంత-నిశాం-తావేశికులం జేసెదనని హర్య-క్షాధ్యక్షుండు కరంబు క్రూరంబుగ సంగరం బొనరించి యీ క్షణంబ సంజీవకుం దోడ్కొనిరమ్మని నన్నుఁ బుచ్చినవాఁడు. మీఁద కార్యంబు నీ యిచ్చవచ్చినట్లు గావింపుము. ఈ యర్థం బూరక పుట్టదు. చేరువం జేరి యెవ్వరో చెవిగఱచెదరు. వెండియు నిట్టివి యేమి పుట్టెడునో యెఱుంగము. నేఁడు నీకయినయది రేపు మాకయ్యెడు. అతీత-కార్యంబునకు విచారంపడ నయ్యెడు ఫలం బేమి? ఎన్నండు రేనికి బానిసతనంబునకుం బూని కొంటిమి నాఁడె మృత్యువునోరం జొచ్చితిమి. ఇందులకయి యిప్పుడు వగచుట గతజల-సేతు-బంధనంబు." అని నిట్టూర్పు నిగుడించి, ఖేద-విషాదంబు లభినయించువాఁడు, క్రిందుచూచుచు మిన్నకుండ, సంజీవకుం డవ్వచనంబు వజ్రపాతం బహార్యంబు నట్లు ధైర్యసారం బగలింపం గొంతవడి వెఱపెల్లిదంబున నివ్వెరపడియుండి, యెట్టకేలకు హృదయంబు పదిలించుకొని, దమనకుం గనుంగొని యిట్లనియె:

2. "అనారతంబు రేనికి లగ్గు దలఁతుంగాని యెగ్గు గలయందయినం దలంచి యెఱుంగ లాఁతివారి కయిన నొకరొప్పమి గావింప మనంబు చొప్పడియుండునే? అకారణంబుగ రేనికిట్టిబెట్టిదంపుఁ గ్రోధంబు పుట్టించి సాధువులం జెఱుప నొడిగట్టిన పుణ్యాత్ములా-బ్రహ్మ-కల్పాంతంబు మనియెదరు గాఁబోలు! సర్పంబులకు విషంబుంబోలె ఖలులకు దోషంబు సహజంబు. వారిం జెప్పనేల? రేని యవివేకంబ సర్వానర్థంబులకు మూలంబు. పార్థివుం డెద్దీనె నవినం గొట్టంబునం గట్టింపు మనువాఁడయ్యేనేని, తెంకలు కొంకుమాని యిచ్చకువచ్చినట్లు రేని నకార్యంబులకు లోఁచి యశోహానిం బుట్టించి పరలోకదూరుం జేయుదురు. ఇంతకాలంబు పార్థివు ననుగ్రహంబు సంపాదింపఁగోరి నా పడినపాటు లెల్లం బొల్లయయ్యె. వివేక విరహితుండగు దొరం గొలుచుట నిష్ఫలం బగుటమాత్రంబు కాదు, ప్రాణహానియు నాపాదించు. మనో-వా-క్కర్మంబుల నొకప్పుడయిన నీషత్తయిన

దోషంబు చేసి యెఱుంగ. సంతతంబు స్వామికి క్షేమంబ కాంక్షింతును. అట్టి నా కిప్పుడు మృత్యువు వక్త్రబిలంబు చొరవలసి వచ్చెఁగాదె? అన్యులకు నెన్నఁడును గీడుఱోసి యెఱుంగను. నా కొఱఁదు సెరగు వెదకుదునె యనంజనదు. రాగ - ద్వేష - దూషి - తాత్ముల మానసంబులు సాధువులయందును వికృతిం బొరయును.

3. ఎట్టివానితోడనేని నవీనసేవకునితోడ రాజును దద్భృత్యులును మనంబునం గలసియుండరు. క్షుద్రజన-పరివృతుం డగు పరివృఢుండు దందశూక - సందోహ - పరివేష్టిత - పటీర - విటపివడువున సమాసన్న-జనంబులకు దెప్పరంపుముప్పు పుట్టించును. కావున నట్టి నిన్నెవారుం జేర వెఱతురు. దీనికిం దార్కాణంబుగ నొక్క కథ వక్కాణించెద వినుము:

4. ఒకానొక పట్టణమునం దొకవడ్లంగి గలఁడు. వాఁడు నానాఁడు వనంబునకుం జని తనపనికి నుఱవగు తరునికరంబు నఱికి స్తంభాదికంబు లొనరించి, పురంబునకుం గొనివచ్చి విక్రయించికొని జీవించుచుండు. వాఁ డొక్కనాఁడు కాననమ్మునం గ్రుమ్మరువాఁడు సుహృద్విలోచనం బను పంచాస్యంబుం గనుంగొని, భీతచేతస్కుఁడయి నిశ్చేతనుండుం బోలె నిలువంబడియుండ, నాహర్యక్షుంబు వీక్షించి, కృపా - తరంగి - తాంతరంగంబయి యిట్లనియె: 'హస్తి - మస్తక విదళన - ఖరంబులు మ - న్నఖరంబులు మ్రుక్కఁడులగుట దయసేయులగు భవాదృశుల పయిం దెగవు. బెగడువడకుము,' నా వాఁడు సాఁగిలం బడి మ్రొక్కి, పెక్కు భంగుల నా సింగంబుం బ్రస్తుతించి, మొదలగొని చని, యది మొదలు కృతజ్ఞుండయి నానావిధంబులగు మధురాహారంబులు దెచ్చి యిచ్చి తనుపుచుండు. ఇట్లు కొన్ని దినంబులు సన నొక్కనాఁడు మెగంబుల ఱేఁడు తన యనుచరంబులగు కాక - జంబుకంబులతోడ ముచ్చటలాడుచుండ నవి యిట్లనియె: 'దేవరవారు కొన్ని దినంబులనుండి వేఁటకుఁబోవ గానము. కారణంబు దెలిసినదికాదు.' నావిని మృగనాథుం డిట్లనియె: 'రథకారుం డొక్కరుండు మదీయ భక్తుండు గలఁడు. వాఁడు ప్రతిదినసంబు నా కాహా

రంబు తెచ్చి యిచ్చుచున్నవాఁడు,' నా విని కాక - జంబుకంబు లిట్లనియె: 'యీకీట్టి యుపకారం బొనరించు పుణ్యుండు సజ్జ - నాగ్రగణ్యుండు గాఁడె? దేవర యనుగ్రహంబు గలిగిన నాతని సందర్శనంబును జేసి మా నేత్రంబులు సాఫల్య పాత్రంబులు గావించెదము.' నాపలికి మృగవల్లభుం 'డట్ల కానిం: డాతండు కొండొకతడవునకు రాఁగలండు. వేచియుండుం' డని పలికి యొక్క యెడ వానితోడం గూర్చుండియుండ, నావల్లంగి చను దెంచి కాంచి, భీత-చేతస్కుండయి సత్వరంబుగ నేదిష్ఠ-పాదపంబు నారోహించిన సింగంబు డాయంబోయి, 'యోయి చెలికాఁడా! యేల యీ పాదపంబు నధిరోహించితివి?' నావుడు 'నన్వ-ర్థాభిధానంబులగు నరిష్ట వంచకంబులు భవ-త్పార్శ్వచరంబు లగుటం జేసి వృక్షంబు నారోహించితి. దుష్ట - పరివృతుండగు రాజును సర్వదా విశ్వసింపం జన' దని వచియించి యచ్చటం గదలక వేచియుండి యొక్క చనుప చను దేర, దానింగూడి య య్యరణ్యంబు వెడలి చనియె.

౫. సజ్జనుండయ్యు దుర్జనులతోడి సంసర్గంబునం జేసి దుర్జనుండు నాఁబడు. బకోట - ఝాటంబుతోడ వసియించు హంసంబును బకం బంద్రుగాదె? భూనాథుఁడు సాధుచరిత్రుం డయ్యేనేఁ ప్రకృతివర్గంబు నట్లగు. 'యథా రాజా తథా ప్రజా' యని నీతి కోవిదుల వక్కాణింతురు. జేనిపాల నెవ్వండో ఖలుండు కల్లనిజంబులు విపరీతంబులుగం బలికి యాతనికి నాయుం దప్రతిరోధంబగు క్రోధంబు పుట్టించినవాఁడు. మించినకార్యంబునకుఁ జింతించి ఫలం బేమి? ఊరక మరణంబు నొందనేల? రణంబుగావించి లబ్ధవిజయుండనయి యశోలక్ష్మిలం బడసి యిష్టసుఖంబు లనుభవించెద నొండె, వేఱొండయిన శూరలోక - శ్లాఘ్యుండనయి నాకలోక - భోగంబు లనుభవించెద నొండె." నా విని దమనకుండు, "నీవు చెప్పినయది శూరలోక - శ్లాఘనీయంబ. అయిన నుపాయాంతరంబు చేఁ బగఱసాధింప నొండెఁ, దప్పించుకొని తొలంగనొండెఁ గొలందిగానియెడం గడ యుపాయంబు సమాదరణీయంబుగాని సాహసంపడి రణమరణంబు శ్రేయం బని కడింది మార్త

రతో నొరసి యుసుఱుదొఱంగుట ధర్మంబుగాదు. 'జీవన్ భద్రాణి పశ్యతి' యను వచనంబుఁ బాటింపవలదె? తనతరంబుం బగఱతరంబు నెఱింగి కరంబు జయంబు నిశ్చయించుకొని మార్కొనవలయు. విపరీతంబయిన బరాభవంబు తప్పదు. తొల్లి సముద్రుండు కరం బారయక యొక్క టిట్టిభంబుం బరాభవింపఁ బూని తాన పరాభూతుం డయ్యె. అయ్యది సవిస్తరంబుగ వివరించెద. నాకర్ణింపుము.

6. పారావారంబు తీరంబున మహీరుహంబుమీఁదం దీతువొక్కండు — గూఁడు పన్నికొని తన చేడియంగూడి వసించుచుండె. అంతం గొంత కాలంబున కా శకుంతంబు తన కాంత గర్భ-శ్రాంత కావుటం గాంచి సంతసించి, 'నీ యిష్టంబు వేఁడు, మది యెట్టికడింది యైన నాగట్టి కడిమి మెఱసి తెచ్చియిచ్చెద' నావుడు నా పులుఁగుఁ జెలువ తన చెలువునితో నిట్లనియె, 'నా యభిమతం బొక్కండు గలదు. వక్కాణించెద నవధరింపుఁడు. పర్వ-దివసంబుల సముద్రుఁడు సముత్తుంగ — రంగ-త్తరంగంబులు చెలంగ నింగిముట్టి పొంగివచ్చును. మన యావాసంబు కరం బాసన్నంబగుటం జేసి నాయిడిన యండంబులు కాం — డాక్రాంతంబులగు. వేళంబ పోలిన యిరవు పరికించికొని చనవలయు మనలంజనదు. ప్రసూతిసమయంబు డాసిన దేశాంతర గమనంబు సుకరంబుగాదు.' నావుడు నావిహంగంబు తన యంగనపలుకు లాలంబుచేసి, మందహాస-సుందర — వదనంబుతోఁ' 'కువలయ — నివహంబునకుఁ దుహినకిరణుండును, బుండరీక — షండంబునకుఁ జండభానుండును, జాతక — వ్రాతంబునకుం జీమూతంబు నెట్లట్లు శకుంత — సంతానంబునకు నాగాంతకుండు ప్రభుండు. అతండు నిజ — పక్ష — నిక్షేప — జాత — వా — తోద్ధూత — కాండకాండ — చండబలుండు, త — దాశ్రయుల మనల నీ జడాశయుండు చెనకి మయిమయిం బోవ నోపునే? ఏల యాలీల నాతరం బెఱుంగక కొఱమాలిన విచారంబులఁ జిత్తంబు హత్తించెదు? సమాహిత-చిత్తంబున నుండుము.' నావుడుం డిట్టిభి యిట్లనియె: ' ఎట్టి వాఁడయిన భా-వ్యనర్థనంబునకుం బ్రహాణకంబగు సాధనంబు పరికించి కృతనిశ్చయుండయి యుండవలయుఁ

గాని బలదర్పంబునం బ్రమత్తుండయి కన్నుగానకుండుట నయవిజ్ఞాన సంపన్నులు కరంబు గర్హింతురు నా నస్మాదృశదుర్బలులం జెప్పనేల? హితవచనంబులు వినని బాలిశుండు కోలవిడిచి పడిన తాఁబేలుంబోలెఁ గాలధర్మంబు నొందు. ఆ కథ సాకల్యంబు మీఱ వాక్రుచ్చెద వినుండు.

7. భువనసారం బను నొక్క కాసారంబు గలదు. అయ్యది చక్ర - చక్రాంగ - ప్రముఖ - వివిధ-జలవిహంగమ-సంచార రమ్యం బయి పుండరీక - షండ - సాంద్ర - మరంద - ధా-రాసార-సంభ్రమ-ద్భ్రమర - ఝంకార - సంకులంబయి యెసగు. అందుఁ దడవులం బట్టి కంబుగ్రీవం బను కూర్మంబు వికట - సంకటంబులను హంసంబులతో బద్ధ-సఖ్యంబయి యుండు. పిదపం గొన్ని వాసరంబులకు వఱపునం జేసి కాసారంబు వారిపూరం బివురం బాఱుడు నా మరాళంబులు దేశాంతర-జిగమిషం బూని యా కచ్ఛపంబు కడకు వచ్చి తమ యిచ్ఛం - గల యర్థంబు వాక్రుచ్చి, వియోగ దుఃఖంబు మీఱం దీఱమి పరికించి, యెలుంగు కుత్తుకం దగుల, 'సఖ్యంబు మఱవకు. పోయివచ్చెదము.' నా విని కమఠంబు కరం బానసంబు దీనభావంబునఁ గదుర నిట్లనియె. 'పెద్దకాలంబేకోదరులంబోలెం జెలిమి సలిపితిమి. దీని కొక్క దోసంగు పొసంగునని కలనేనిం దలంచి యెఱుంగ. మీతోడం గూడ వచ్చెద నంటినా, పక్షంబులబలిమికలిమిం జేసి వలయు నెలవునకుం బోవవలంతు లగు మీకును నాకు నెంతయుంతరంబు? నాకొలంది విచారించికో లటుండ నింక. మిమ్ము నొక్కటి వేఁడెదం; జిరకాల కృతంబగు చెలికారంబున కనురూపంబుగ నా ప్రార్థి-తార్థంబు తుదముట్టింపవలయు. వెరపు పరికించి యెట్లయిన మీతోడ నన్నుం గొంపొండు. మీ వియోగంబు క్షణంబయిన సయిరింపఁజాల.' నావుడు నాయంచ లించుక చింతించి, 'యిది యెట్లయ్యెడు? ముక్కునం గఱచికొని యుండెఁ, ఱెక్కల నెక్కించుకొని యుండెం గొంపోవలయు. విప్రకృష్ట - దేశ -గాములకు మాకిది దుస్సాధ్యంబు. సాహసంబు చనదు. ఎటువోయి యెటువచ్చునో యెఱుంగము. వినుము; హృదయంబు పదిలించుకొని కుదురు గదలక

యుండుము భాగ్యంబుగలిగినం బున-ర్దర్శనం బయ్యెడు’ నని యెంత దూరంబు చెప్పిన వినక కడుం గక్కసించిన, నా యుండజంబులు కొండొక కాలంబులవిచారించి యెట్టకేలకుం దా మేటిం గాంచి ‘యొక్క వెరవు పరికించితిమి. అది కొంత మదికి సరిపడియున్నది. ఒక్క యష్టి సేకరించి దాని యగ్రంబులు చెరియొక్కపక్క ముక్కునఁగఱచికొని పఱచెదము. దానినడుమ ప్రమాదంబుం బొరయక కఱచికొని రా నోపుదే?’ యనవుడు వల్లెయని త-దానీతంబయిన కాష్ఠంబు నడుమ గఱచికొని వ్రేల, నా యంచలు చంచుపులం ద-దంచలంబులు పొంకించి యంబరతలంబున సత్వరంబుగఁ బోవుచుండ, నొక్కపట్టణంబునందలి జనంబులు వీని విలోకించి, విస్మయంపడి కావించు సల్లాపంబుల యల బలంబు క్రిందుగ వినంబడుడుం గూర్మం ‘బీ కలకలం బెక్కడిది?’ యని హంసంబులనడుగ నోరుపట్టువదలి, నేలవ్రాలి, మాంసలుబ్ధులచే హతం బయ్యె. మతిమంతుఁ డనర్థావహంబగు నభిజనంబు మానికొనవలయు నొండె, ననర్థంబుదలంగు నుపాయ-సంపన్నుఁడు గావలయు నొండెం, గాని దైవపరుండయి యుండంజనదు. దైవపరున కనర్థంబు తప్పదు. ఈ యర్థంబు తేటపడ నొక్కకథ చెప్పెద వినుము :

8. ఒక్క జలాశయంబునం దనాగతవిధాతయుఁ, బ్రత్యుత్పన్నమతియు, యద్భవిష్యంబు, నని మూఁడు మత్స్యంబులు వసించుచుండు. ఒక్కనాఁ డనాగతవిధాత ప్రత్యుత్పన్నమతి యద్భవిష్యంబులం గాంచి, ‘యీయేఁడింతవఱకు వాన లేబరంబయ్యె. మీఁదనయినను గురియునను నాస లేదు. నిమిత్తంబులు ప్రతికూలంబులయి కానంబడియెడు. ఈ కొలని జలంబులు తుదముట్ట నడుగుఁబట్టకమున్న మెలంకువ పడవలయు. మసలిన మోస వాటిల్లు. ఇటకుం గొంత దూరంబున ధ్రువోదం బను హ్రదం బన్వర్థాభిధానంబు గలదు. ఇచ్చటికివరవ యచ్చటినుండి వచ్చుచున్నయది. అదియు వెనుమూయం దోయంబు లేక యుండెను. నడికిరేయిట నల్లల్ల నా వరవంబడి యా మడువుం జేరి, యీబారిం దలంగుదము. ఇంతకుం గొంతముందు కొందఱు మైనికులు వచ్చి యిచ్చటి జలంబుకొలంది పరికించి ‘పదిదినంబులకు నివురం

బారెదు. అప్పటికివత్త'మని యొండొరులతో నాడికొనుచుంబోయిరి. అది మొదలుగ నా యుల్లంబు పెల్లుగ నుడికిల్లెడు.' నావిని ప్రత్యుత్పన్నమతి, 'దీనికింతయేల? అంతవచ్చినప్పుడు చూచికొంద' మనియె. యద్భవిష్యుండు మిన్నకుండె. అంతట ననాగతవిధాత యారాత్రి జలాశయంబు నిర్గమించి యొయ్యొయ్యం బోయి ధ్రువోదంబుం బ్రవేశించె. ఇల నానాఁట నెండలమెండున సలిలం బల్పావశేషంబుగ శోషిల్లుడు జేవ్రుబోయలు వల, ఎత్తెల, కొడమ, గత్ర, మావు లోనగు సాధనంబులు గొనివచ్చి పెచ్చువేడుకం జొచ్చి మీలంబట్టి పట్టి, గట్టునకుం జేర్చుచుండ నంత, యద్భవిష్యుంబు మిట్టిమిట్టిపడం బడియంగొట్టి కొనయుంచిరి. ప్రత్యుత్పన్నమతి మృతకల్పంబుగ జలంబులం దేలగిలంబడి యుండం గని నిరంబు చేరువం దీరంబునకుం బాఱంజిమ్మి మీనసంతానంబు నిరవశేషంబుగఁ బట్టికొని గట్టు చేరెడు నా మత్స్యం బల్లల్ల దిరిగి వారిం బడి వారిబారిఁ దప్పించుకొని చనియె.'

9. అని చెప్పినవిని టిట్టిభంబు నీ విందులకయిన కొందలం పడకుము. బూటకపు మాటలమూట యని నన్నుఁ దలంపకుము. కార్యంబు తఱి నా నెఱమగంటిమి మెఱయించి, నీమెచ్చు వడయువాఁడ నిన్నకుండు,' మనవుడు నా విహం-గాంగన తనభర్తకు మాఱువలుక వెఱచి యూరకుండె. అంతం గొన్ని దినంబులకు నా విహంగి ప్రసవించుడు సముద్రుండు టిట్టిభంబు పంతంబు పరికింతమని కల్లోల-మా-లాభీలంబుగం బొంగి తదీ-యాండంబు లపహరించె. అనంతరంబు పులుఁగు వెలంది తన పెనిమిటిం గనుంగొని 'తొల్లి నా వచనంబులు వినరయితిరి. ఇంక నేమి చేయవచ్చు' నని చొటచొటం గన్నీరు దొరుఁగ నంగలార్చుడు నా ఖగంబు దాని మిగుల నూఱడించి పులుంగు బలంగంబులం గూర్చి తనకు సముద్రుండు గావించిన పరిభావంబు తెలియంబలికి, 'యజాండ-సహితంబుగ నావరణవారి పూరంబు నిశ్శేషంబుగ గండూషింపం జాలిన చండవిక్రముఁడు వజ్రతుండుఁడు మనకు రక్షకుం డని యీ జడాత్ముం డెఱుంగఁడు గాఁబోలు. ఇప్పు డవశ్యంబుగ నెఱింగింత; మెఱింగింపకున్న గర్వంబు మానండు. ఇది

యల్పంబు, దీని కింత యుద్యమం బేల, యని యొప్పరికింపరాదు. నేఁడు
గోరంతకు వచ్చినది. ఱేపు కొండంతకు వచ్చు. మన మందఱ మవహిత-
చిత్తంబులతో విన- తానంద - సుధాయకుం డగు వినతా-నందనుం
బ్రార్థింత, మాదయాళుం డా మహామహుండు మనయనిష్టంబు దలంగి
యిష్టంబు చేయఁగలం' డని యొడంబఱిచి, యా ఖగంబులుం దానును
భక్తి తాత్పర్యంబు మీఱ నిరంతర-ధ్యానం బొనరించుచుండుం బక్షి
స్వామి సాక్షాత్కరించి, 'హృష్టుండనయితి, మీ యిష్టం బొసఁగెద.
వేఁడుం' డనవుడు నండజాతంబులు మిగులం బ్రీతంబులయి తమకు
సముద్రుండు గావించిన యవజ్ఞ విజ్ఞాపించిన నాతండు కుపిత-చేతస్కుం
డయి నదీ - నేతంగాంచి ని-జాదేశంబున నయ్యండంబులు దెప్పించి
యప్పక్షుల కిప్పించి, 'యిప్పటికి క్షమియించితి. ఇటమీఁద నస్మజ్జనం
బులకు నెగ్గుదలంపకు నీ కది లగ్గుగా' దని నుడివి యంతర్హితుండయి
చనియె."

10. నావిని సంజీవకుండిట్లనియె: "దమనకా! వినుము. కల
కాలంబు బ్రదుకంబోము. చావు నిక్కంబు. మన కన్నుల ముందఱం
బుట్టిగిట్టినవారి నెందఱం గానము. నిన్న యున్నవాఁడు నేఁడు లేఁడు.
నేఁడు పగతు మొగంబునకుం దోలఁగిన ఱేపు మృత్యువు మొగంబు
నకు దోలంగ వచ్చునే? దానంజేసి యపయశంబు దప్పం బ్రయోజ
నంబు గలదె! పగతుకడిమి దడవక కడఁగినవాఁడం గాను. లాఁతి
వెరవు లావుగామిం జేసి ప్రకృతోద్యమంబుం బూనవలసె. కడమాట
యొక్కటి వినుము. ప్రాణహాని కయిన నోర్తుంగాని మానహాని
కోర్వంజాల. ఇది నిక్కంబు. నీ వింక నాకడంకకు నడ్డవాట్లు వ్రేయ
కుము. నే నిదె వచ్చెదఁ 'గట్టాయితం బయి యుండు' మని ఱేనికిం
జెప్పుము. వేగిరింపుము. లెమ్ము పొమ్ము." నావుడు దమనకుండు
సరభసగమనంబునం జనువాఁడు, ఱేనియిరవుమోసలం గరటకుం
గనుంగొని, 'లోనికిం బోవచ్చునే? యసమయంబు గాదుగద?' నావు
డుం, 'బోవచ్చును. సమయంబ. ఱేఁడు నీ రాక వేచియున్నవాఁడు.
పోయిన పని యేమయ్యె?' నని కరటకుం డడుగ, దమనకుండు మొగం

బునం జిఱునగవు మొలతేర విలోకించి, 'యేమో యేలయయ్యెడుఁ? గార్యంబు పండించుకొని వచ్చితిం; బిదపఁ దుదముట్టఁ జెప్పెద. నీవు పోయి సన్నిధానంబున నుండుము. వెంబడి నే వచ్చెద' నని కరటకుం బుత్తెంచి కొంతవడికిం దానుం జని, ఱేనిం గనుంగొని, 'రమ్ము కూర్చుండు. వృత్తాంతంబేమి?' యని యాతండడుగఁ జేరువకుం జేరి, యోరసిలం గూర్చుండి, యల్లన నిట్లనియె: "నేను బోయిన సమయంబున సంజీవకుఁడు లోనియిరువునం గాటక - పాటకులతోడ మాట లాడు చుండి ననుం గనుంగొని వారితోడి సల్లాపంబుసాలించి, ప్రత్యుత్థానంబు గావించి, యుచి - తాస - నాసీనుం జేసి, కుశలప్రశ్నం గావింపఁ, ద - దవస - రోచితంబుగం గొన్ని మాటలాడి, యేకాంతం బాకాంక్షించు మా జాడ యెఱింగి కాటక పాటకులు లేచి, యెడ గలుగం బోవుడు, నయ - భయంబులు దోప వచనీయం బశేషంబు వచియించితి. ఆతండును దనకుం బోలిన వచనంబులు తెంపరితనంబు దోపం బెక్కులు వచియించె. అవియెల్ల నాకు వాకొన మీకు నూఁకొనఁ బోలవు. ప్రయోజనంబును లేదు. ఆతని యుద్యమంబు సమస్తంబు ప్రతికూలంబగుట త-ద్వచన-భంగి నెఱింగితి. చిరకాలంబు సంగాతంబు గావించిన వాఁడం గావునఁ గాని చేఁతకు నాతండు చేయు నుద్యమంబునకు మనంబునం దాళంజాలక యాతనికి హితంబుగ నాకుం దోఁచినయంత యొత్తి చెప్పితి. ఎంతచెప్పిన నతండు 'తాను బట్టినకుందేటికి మూడే కాళ్లను చున్నవాఁడు. 'వినాశకాలే విపరీతబుద్ధి' యను వచనం బేల తప్పు? కాలం బాసన్నంబైన నాతని కిట్టి కుబుద్ధి పుట్టెఁగాఁబోలు. అతండు పర్యవసానంబునం దన యు-ద్ధోద్యమంబు తెల్లంబుగం బలికి, 'యింక నా కడంకకు నడ్డవాట్లు వ్రేయకుము. నేనిదె వచ్చెదం; గట్టాయితంబై యుండుమని ఱేనికిం జెప్పుము. లెమ్ము పొ'మ్మని దిట్టతనంబు మీఱం బలికె. అతం డింతకుఁ గృతసన్నాహుఁడై దాయవచ్చుచుండు. కర్తవ్యాంశంబు దేవర చిత్తంబునకె విదితంబు."

1. అర్థాములు:— (పేరా1) ఉదన్య + అపనోదనంబుకయి = దప్పికనుఁ బోఁగొట్టుకొనుటకు. కృతాంత - నిశాంత+ఆవేశకులన్ = యముని యంతిపురమునఁ - బ్రవేశించినవారినిగ. సంగరంబు (నా. నా) ప్రతిన, యుద్ధము. చెవిగఱచెదరు=కొండెములు చెప్పెదరు. ఆహార్యంబు=కొండ. వెఱపు+ఎల్లిదమునన్ భయాధిక్యముచే. (పే. 2) లగ్గు వ్య) ఎగ్గు. లెంకలు=సేవకులు. త్రుంగించెన్=చంపించెను. (పే. 3) ఉపత్యక=కొండసమీపపు భూమి. కంఠీరవము (వ్యు) కంఠమునందు గంభీరమగు ధ్వని కలది (సింహము). ఉష్ట్రము, క్రమేలకము = ఒంటె. త్రాసంబువాసి = భయమువిడిచి. ప్రతీపప్రతాపము= విరోధుల పరాక్రమము. (పే. 3) పరివృఢుఁడు=ప్రభువు. పటీరవిటపి=చందనపుచెట్టు. ముప్పు (నా.నా) ఆపద, ముదిమి. (పే.4) ఖరంబులు=కఠినములైనవి. ముదల=ఆజ్ఞ, సెలవు. శేదిష్ఠపాదపము=దగ్గరిచెట్టు. అరిష్టము=(నా. నా) కాకి, కీడు. చనుప=వర్తకబృందము. (పే. 5) బకోటఘూటంబు = కొంగలగుంపు. నాకలోకము = స్వర్గలోకము. కడయుపాయము=సామ, దాన, భేద, దండములలో తుదిదగు దండోపాయము. మార్తురు=విరోధులు. జీవన్భద్రాణి పశ్యతి=బ్రతికియున్నచో శుభముల ననుభవింపవచ్చును. టిట్టిభంబు=తీతువుపిట్ట. (పే. 6) పారావారము=సముద్రము. శకుంతము=పక్షి. చెలువుఁడు=ప్రియుఁడు. కాండ+ఆక్రాంతములు=నీటిచే కమ్ముకొనఁబడినవి. జీమూతము. (వ్యు) నీటిని బంధించునది. (మేఘము). ప్రవారణకము=కొట్టివేయునది (నివారించునది). బాలిశుఁడు=నీచుఁడు. (పే. 7) చక్రము=చక్రవాకము. చక్రాంగము=హంస. ఆసారము=వర్షము. జిగమిష = వెళ్ళవలెననుకోరిక. కచ్ఛపము (వ్యు) తోఁకతో నీరుత్రాగునది-లేక-ముఖమండలమును గాపాడుకొనునది (తాఁబేలు). కమఠము (వ్యు) నీరు నివాసముగాఁ గలది (తాఁబేలు). విప్రకృష్టదేశగాములు=దూరదేశమునకుఁ బోవువారు. యష్టి = కఱ్ఱ. (పే. 8) శేబరము=శూన్యము. వరవ=నీటిజాలు. బారి=ఆపద. కెడయించిరి=చంపిరి. (పే. 9) పరిభావము=పరాభవము. వినత+ఆనందసంధాయకుండు = మ్రొక్కినవారి కానందమును గలిగించువాఁడు. (పే. 10) కడు+అయితంబయి= కట్టాయితంబయి=మిగుల సిద్ధపడి. తెంపరితనంబు=సాహసము. సంగాతము(ప్ర) సాంగత్యము (వి).

2. ప్రశ్నలు:-

1. రాజసేవాపరుఁ డెట్టివాఁడు ?
2. ఱేని యాగ్రహవార్తను విని సంజీవకుఁ డేమని చింతించెను ?
3. టిట్టిభము తమయండముల నెట్లు సంపాదించెను ?
4. దమనకుఁడు పింగళకునితోఁ జెప్పినమాటలేవి ? దాని కాఁ తఁడేమనెను ?
5. ఈ క్రిందివాని భావములను సందర్భసహితముగ వివరించునది:—

"యథా రాజా తథా ప్రజా"
"జీవన్ భద్రాణి పశ్యతి"
"వినాశ కాలే విపరీతబుద్ధిః"
"తాను బట్టిన కుందేటికి మూఁడే కాళ్ళు"

3. రచన:— (1) "దైవపరున కనర్థముతప్పదు" "దుష్టజనపరివృతు నెవ్వరును నమ్మరు" అను నీతులనుదెలుపు కథలను వ్రాయునది. (2) దమనక సంజీవకుల సంభాషణమును (సంభాషణరూపమున) చిత్రించునది. (3) ఈ క్రిందివానిని వాక్యములం దుపయోగించునది:— చెవిగఱచుట - గతజలసేతుబంధనము - ఎద్దీనెననినఁ గొట్టంబునం గట్టింపుమనుట - యథా రాజా తథా ప్రజా.

4 వ్యాకరణాంశములు:— క్రిందివానిలోని వ్యాకరణాంశములను వివరించునది:—

నోరంజొచ్చితిని - మధ్యాహ్నంబు - విచారింతము - నానాఁడు - మీలు - రానోపున!



నీకును మాకుఁ బలెఁ గరచరణాద్యవయవములు గలవు. మాటలును మాకున్నట్లున్నవి. కర్తవ్యాకర్తవ్య విచారము సమానము. మఱచి తిని. స్థావరముల కంటెఁ గీటకములకు వానికంటె మృగాదులకు వాని కంటెఁ బతంగాదులకు వానికన్న మాకును మాకన్న మీకును శరీర పాటవము విజ్ఞానమును ఘనతరము. అట్టియెడ భక్ష్యాభక్ష్య పేయా పేయ వివేకము లేకుంటయున్నె? ఈ దురాహారము శుచిగాదు; రుచిగాదు; మీఁదు మిక్కిలి పాపమూలకము. పాపము పరలోకమున బాధకము. పరలోకము ప్రాణాంతమునఁ దటస్థించును. చిరస్థిరప్రాణుల మగు మాకేటి భయ మనవలదు. ప్రాణభయము మాకు నేఁడయ్యె నేని మీకు మఱునాఁడో, యావలినాఁడో యగును. ఇంత విచారించి నీకు రుచించినట్లనుము" మన రాత్రించరుఁడు కహకహ నవ్వి "మా పఠింపని వేద శాస్త్రములు లేవు. నీవు నాకు బుద్ధులఁ గఱపవలయునే? నిన్నెట్లును జంపక విడువ" ననియె. అంత దాసరి "యిట్లయిన నా ప్రార్థన మొండు గలదు. దానినిఁ గావింపుము ఈ కుఱఁగట నున్న కురుంగుడిలో పేంచేసి యున్న వైకుంఠుని ననుదినము సేవింప వ్రతముఁ బట్టియుంటిని. అట కరిగి గానముసేసి వచ్చి నీ కాహార మగుదు" నన నవ్వ్వాలసుదండి "నోటి కందిన యాహారము వదలుకొను మందుఁ డుండునే? నెపము వెట్టి తప్పించుకొనిపోయి బాస తింటి నని తన శరీర మర్పింప మగిడివచ్చు మానసి యుండునే? నిన్ను విడుచుటయు నీవు వచ్చుటయు నసంభవములు. నీ మాటలు విశ్వసింపను." అన నతఁడు చెవులుమూసి "నారాయణ! నారాయణ!" యని "నన్ను నీవు నమ్మవేని శపథము లొనర్తు నని పెక్కు శపథములు పలికి నమ్మకున్న,

ఎవ్వని చూడ్కిఁజేసి జనియించు, జగంబు వసించు, నిజ్జగం
బెవ్వనియందు డిందు మఱి యెవ్వనియం, దిది, యట్టి విష్ణుతో
నివ్వల నొక్క వేల్పు గణియించిన పాతకినౌదు నేఁడ నే
నెవ్విధినైన నిన్గదియ నేని యనన్ విని బంధ మూడ్చినన్.

ఎట్టకేలకు రాక్షసుఁడు విడువఁ జండాలుఁ డరిగి నన్ను సేవించి మంగళ కైశికీ గానము సేసి యసత్యభయమున వేవేగవచ్చి యా నిశాచరుని మ్రోలవ్రాలి "నన్ను భక్షింపుము. నీ యానతిఁ గొనిపోవునపుడు నా కే చరణము లే యుదర మేయుర మే శిర మే కరము లాచరణ మా యుర మా శిర మా కరములును జూచుకొమ్మ"నఁ బిశితాశనుఁ డబ్బురపడి యానంద బాష్పములు రాల బులకితగాత్రుఁ డై హరిదాసు నకుఁ బ్రదక్షిణించి పాదముల వ్రాలి "నే నిట్టి సత్యము నెందును జూడ నైతి. నీ కితరు లీడుగారు. ఎన్నాళ్లనుండియో యీ కూడు దినుచు నీ పాపిష్ఠ శరీరమును బోషించుకొనుచు నెన్నటికైన నొక మహాత్ముఁడు రాకుండునా? అతని వలన నా యీ రాక్షసజన్మము దొలఁగించుకొన కుందునా? యని తలంచుచుండ నా పుణ్యవశమున దయ చేసితివి. మీవంటి భాగవతులు మావంటి పాపులను బావనులను జేయరేని మా కేమి గతి" అన, దాసరి "నన్నేమి సేయుమందు? వ"న, వాఁడు "ఓయీ! నేనొక బ్రహ్మరాక్షసుఁడను. కుంభజానుసంజ్ఞుఁడను; క్రూర కర్ముఁడనై యీ వటవృక్ష మాశ్రయించి పాంథ జనుల హింసించి భక్షించుచుందును. పూర్వమున సోమశర్మ యను బ్రాహ్మణుఁడఁ గాన దయనీయుఁడ. ఒక్క దుష్కర్మమున నిట్లయితిని. నీవు కైటభారిం బాడిన నేఁటి పాటఫలము సజలముగా ధారవోసి నాకిచ్చితేని నా రాక్ష సత్వము నశించు. నీకును నార్తరక్షణమున నగు సుకృత మబ్బును" అనెను. దాసరియుఁ గలకల నవ్వి "ఈ తుచ్ఛశరీర రక్షణార్థ మొక నాఁటిది కావొక త్రుటిగత ఫలమునేని నొసఁగఁ జాల" ననెను. దైత్యుఁ డును "గోసంగీ! నీసంగీత ఫలములో సగమేని ని"మ్మని మరలఁ బ్రార్థించెను. దాసరి "యీ పాతాళ ప్రశ్నలు మాని ప్రతిజ్ఞ ననుసరించి నా యొడ లిడుము. భుజింపు"మనెను. అయ్యసురయు దీనాతిదీనుఁడై పాదములు వదలక 'విష్ణుభక్తులు దయాళురు గారే! నా యీ రాక్ష సత్వ ముడిపి కృతార్థునిఁ జేయవే? నీ పాటలోఁ బాతిక పాలైన నిమ్మ. అదియు నీ వొల్లవేని నీ ప్రభాతమునఁ బాడిన చరమగీత ఫలమైన

నిచ్చి ప్రసన్నుఁడవగు!' మన దయార్ద్రచిత్తుఁడై 'అట్లు కానిమ్ము తొలుత నీ వెవనివి? యీ శరీరప్రాప్తి కారణ మనఁగ వాఁడు దుఃఖార్తుఁడై యిట్లు చెప్పెను.

"నేను జోళదేశమున వసించు బ్రాహ్మణుఁడను. చదువనాలుగు కళలు గఱచితిని. పరాస్త్రపారంగతులను తత్త్వజ్ఞుల నవ్వుచుఁ బరిహసించుచు నుంటిని. పెద్దలతో నోడియు నోడనైతినయు నరిపోయి జయించితి నటియు నబద్ధములాడి చిల్లర ప్రసంగములకు భ్రమఁగొల్పి ధనమార్జించుచు దీనినిఁ జూచి యద్దానియం దభిలాష పొందము విస్తృతము మనుజావస్థాపమున కరిగి దుర్దానములు దురన్నములు దుష్కార్యములు సేయుచు ద్రొక్కము గడించి దానినొక కోమటికి వడ్డి కిచ్చి నన్ను వంచింప దొంగలెక్కలు జూపు వానితోఁ గలహించి రచ్చ కెక్కితిని. అద్దాన నాకడఁ గడుంగడు విడిముడి గలదని యెఱిఁగి యొక దొంగ నన్నొకకంటఁ గనిపెట్టుచుండెను.

"కొంతకాల మిట్లుండి యొకనాఁడు నేను ప్రయాణముపోవు నదను వేచి నన్ను వెంబడించి వచ్చుచు నాకు దారిఁ జూపుచున్నట్లు నటించుచు నడవిలోని వాఁగు కడకుఁ ద్రోవ దీసి యచట నిలవేసెను వేయుటయుఁ బెక్కండ్రు చోరు లొక్కుమ్మడిని వచ్చి నాపైఁ బడి నా సొమ్మంతయు నపహరించిపోవుచుండిరి. నే నప్పుడు నోటిశనిచే నూర కుండక యొక దొంగ నుద్దేశించి "ఓరోరి! నీవు మా పొరుగూరి వాఁడవు కావా? ఎఱుఁగవో యెదవులే! ఈ సొమ్ము నీకుఁ దక్కునే? కానిమ్ము'' అన వాఁడు నన్ను బ్రతుకనిచ్చినచోఁ దనకు సంకట మగునని నన్ను బడిపోట్లుపొడిచి పోయెను.

"అంతఁ గొంతమందితో వెనుక వచ్చుచున్న నా బావమఱఁది నా యవస్థను విని వచ్చి నన్నుఁ గావటిలోఁ బెట్టుకొని తీసికొనిపోవుచుండ నీ చెట్టుకడ నా ప్రాణములు పోయినవి. కయ్యమున నా కాయమునకు గాయములు దగిలించిన యా చండాలుని కరాళవేషము నా కన్నులఁ గట్టినట్లు మరణకాలమునఁ గానఁబడుట నాకీ కరాళ

రూపము వచ్చెను. నీ కైశికీగానఫలమిచ్చి దీని మాన్పవే," యని ప్రార్థించిన, మాలదాసరి, "నా గానఫలపరిమాణ మింతయని తెలియజాలను. నీ కెట్లునేర్తు? నీవు వెఱవకుము. భగవంతుఁడగు శ్రీమన్నారాయణుఁడే నిన్ను రక్షించు" నను మాట నోటనయుండ బ్రహ్మరాక్షసత్వము వదలిపోయి సోమశర్మ విష్ణుభక్తుఁడై నిలచి యా చండాలుని బహువిధములఁ బొగడి ప్రదక్షిణించి బదరీవనాదితీర్థయాత్రలు సేవించి నిర్వాణమొందె!

## 1. అర్థములు:

కాకోలము = కాకి. పలలభుగిండి = రాక్షసుడు గోసంగి = మాలవాఁడు విత్తము = ధనము. కరాళము = భయంకరము. ఫలము = పండు, సిద్ధి. కింకరుఁడు = ఏమి చెప్పినను చేయువాడు - సేవకుఁడు. క్రవ్యాదుఁడు = మాంసమును దినువాఁడు - రాక్షసుఁడు. పతంగము = పడుచుపోవునది - పక్షి. రాత్రించరుఁడు = రాత్రుల సంచరించువాఁడు - రాక్షసుఁడు. నిశాచరుఁడు = రాత్రియందు చరించువాఁడు - రాక్షసుఁడు. పాంథులు = పథమునఁ బోవువారు, బాటసారులు. కైటభ + అరి = కైటభుడను రాక్షసునకు శత్రువు - విష్ణువు. దైత్యుఁడు = దితి సంతతివాఁడు - రాక్షసుఁడు.

## 2. ప్రశ్నలు :

1. ఈ పఠనీయ మే గ్రంథమునుండి గైకోఁబడినది? గ్రంథకర్త ఎవరు?
2. ఈ క్రిందివాని అర్థ సందర్భముల నెఱిఁగించునది?

మార్గమే మహా లాభము.

వంటయింటి కుందేలైన నేనిక నెటకుఁ బోవుదును.

నోటి కందిన యాహారము వదలుకొను మందుండుదునా?

నీ కితరు లీడుగారు

విష్ణు భక్తులు దయాళురు గారే.

## 3. రచన:

ఆమూలాంతముగా, వంటయింటికుందేలు, మీదుమిక్కిలి, రచ్చకెక్కుట, గని పెట్టుట, వీనిని సొంతవాక్యములలో నుపయోగించునది.

4. వ్యాకరణాంశములు:—

సమ్మార్జన + ఉదకము = సమ్మార్జనోదకము. శాఖా + ఉపశాఖలు = శాఖోపశాఖలు. చరణ + ఆది + అవయవములు = చరణాద్యవయవములు. ఆనంద బాష్పములు. షట్ + శాస్త్రి = షట్ఛాస్త్రి. శ్రీమత్ + నారాయణుడు = శ్రీమన్నారాయణుడు.

ఆహ్వానించిండి. ఇజ్జగము - త్రిక సంధులు. అబ్బురపడి : పద్యాదులు పరంబగునపుడు ము వర్ణకమునకు లోపము. ఇచ్చితేని (ఇచ్చితివి + ఏని) లిడాట్టుల నకారంబునకు లోపంబు బహుళంబు.

ఆమ్రేడిత సంధిని సూత్ర సహాయ్యముతో దృష్టాంతము లిచ్చుచు వివరించుమనది.

# ౩. పోతన

## శ్రీ శేషాద్రి రమణకవులు

ఈ వ్యాసము శ్రీ దూపాటి శేషాచార్యులుగారు, వేంకటరమణాచార్యులు గారనెడు జంటకవులచే వ్రాయఁబడినది. వీరు శతావధానులు. ఈ కవులు సారస్వత సేవాతత్పరులు. తెలంగాణమునందలి హనుమకొండ నగరమునఁ జాలకాలము వసియించి, సారస్వత క్షేత్రమునఁ దా మొదరించిన కృషిని ఆంధ్రలోకమున కెఱుక పఱచిరి. వీరిలో శేషాచార్యులుగారిపుడు లేరు. వేంకటరమణాచార్యులు గారు హైదరాబాదునందలి ప్రాచీనవస్తుపరిశోధనశాఖయందుఁబనిచేయుచున్నారు.

ప్రకృతభాగము వాణీనికేతనమువారిచేఁ బ్రచురింపఁబడిన భాగవతమునందలి తృతీయస్కంధమునకు వ్రాసిన పీఠికలోనిది. ఈ వ్యాసమందుఁ బోతనామాత్యుని యందలి గొప్పతనము సంగ్రహముగను, స్పష్టముగను జిత్రింపఁబడినది.

"చదువులం గూర్చెడి తెల్గువల్కుబడులన్ సంధించి యాంధ్రావనీ
శ్రవణాలంకరణాభిరామ కవితాసంపత్తితో నాంధ్ర భా
గవతంబున్ రచియించి లోకహితముం గల్పించె నే ధన్యుఁ డా
కవి చూడామణి నెంతుఁ బోతన కవిన్ గల్యాణవాగ్భారవిన్."

1. ఆంధ్రవాఙ్మయము నందుఁగల అత్యుత్తమ కావ్యశ్రేణిలో నొకటిగఁ బరిగణింపఁదగినది సహజపాండితీ మండితుఁడగు పోతనామాత్యుని ఆంధ్ర భాగవతము. నన్నయ్య భట్టారకుండు తెలుఁగు బాసకుఁ బ్రాణభిక్ష పెట్టి భారతమునఁ గొంచెము తక్కువగ మూఁడు పర్వములు రచించి వాగనుశాసన బిరుదము సార్థకముఁ జేసికొనినాఁడు. తిక్కనయజ్వ మహోజ్జ్వలధారాశుద్ధితో నిరర్గళ పదకల్పనముతో భారతమును బదునైదు పర్వములఁ గూర్చి "మహాకవిత్వ దీక్షావిధితో" మాతృభాష నలంకరించి కవిబ్రహ్మ బిరుదము సార్థకము గావించుకొనినాఁడు. భారత భాగము "కవీంద్రశ్రవణ పుటపేయముగా" ఎఱ్ఱాప్రగడ పూర్తిఁజేసి ప్రబంధపరమేశ్వరుఁ డైనాఁడు. భాస్కరాదులు రామాయణమును దెలిగించి భాష నలంకరించిరి. పాలకురికి సోమనాథుఁడు శైవమత గ్రంథసారము మహాపురుష జీవితములో లగ్నము గావించి యసమాన వైదుష్యము సాటినాఁడు. వన్నె

చోడుఁడు, నాచన సోముఁడు కావ్యరచనమున కనుకూలములగు మనోజ్ఞ భావములు క్రొత్తపోకడలు పలుకుం బొందికలు వెలయించిన ధన్యులు. ఆదికవు లందఱి గుణములు తనలో జీర్ణించుకొని వాఙ్మయమున కద్వితీయ మగుసేవ గావించి శ్రీనాథ కవిసార్వభౌముఁడు కవితాసౌష్ఠవమునకు మార్గదర్శకుఁడైనాఁడు. వీరిలో నెవ్వరును భాగవతము తెలిఁగింపఁ దొరకొనమి తననే ధన్యుని గావించుటకని బమ్మెర పోతరాజు తలంచుచున్నాఁడు. చూడుఁడు.

"ఒనరన్ నన్నయ తిక్కనాది కవు లీ యుర్విన్ బురాణాళిం
దెనుఁగున్ జేయుచు మత్పురాతన శుభాధిక్యంబుఁ దానెట్టిదో
తెనుఁగున్ జేయరు మున్ను భాగవతమున్ దీనిం దెనిఁగించి మ
జ్జననంబున్ సఫలంబుఁ జేయుదుఁ బునర్జన్మంబు లేకుండఁగన్."

2. కాని సత్యము నాలోచించినచోఁ దనకుఁ బునర్జన్మము లేకుండుటకుఁ గాదు సోదరాంధ్రులకుఁ బునర్జన్మము కలుగకుండుటకే పోతరాజుభాగవత రచనమునకుఁ దొరకొనినాఁడు. పరమేశ్వరార్పణముగఁ గావ్యఫలము నర్పించి ధన్యుఁడైనాఁడు.

3. ఆదికవియగు నన్నయ భట్టారకునితోఁ గవులకు రాజాశ్రయ మలవాటైనది. రాజులు గూడఁ గావ్యశ్రవణానందమగ్నులు. రాజరాజు, మనుమసిద్ధి, వేమభూపాలుఁడు, వీరభద్రారెడ్డి మున్నగు ప్రభువులు కావ్యరచనమునకు సమకాలిక కవిరాజులను బ్రోత్సహించినారు. కవులు వారి యాశ్రమమున సమస్తభోగములతోఁ దులదూఁగుచు వాఙ్మయసేవగావించి ధన్యులైనారు. ఈ పరిస్థితి పదమూఁడవశతాబ్ది కారంభమువఱకు నెడతెగక నడచినది. ఈ సందిగ్ధ కాలమున జనించిన స్వాతంత్ర్యశీలుఁడు బమ్మెరపోతరాజు. సమకాలదోషముచేఁ బోతరాజు గూడ ఇవటూరి సోమనారాధ్యుల సంస్మరణముతో వీరభద్రవిజయము, సర్వజ్ఞ సింగభూపాలుని శృంగారలీలావిలాస వర్ణనములతో భోగినీదండకము రచించి కాలప్రవాహమునఁ గొంతకాలము కొట్టుకొనిపోయినాఁడు. భాగవతరచనారంభమునుండి యాతని జీవితమున కొక విశిష్టత్వ మలవడినది. భోగ భాగ్యములను

తిరస్కరించినాఁడు. కావ్యాంకితమునకు బ్రాకులాడు రాజులను 'మను జేశ్వరాధము'లని తెగడినాఁడు. రాజుల కంకితము నొసంగుట కాలునిచే సమ్మెటవ్రేటులఁ దినుటకుసాధనమనితలంచినాఁడు.హృదయమున శ్రీరామచంద్రుని సాన్నిధ్యమును గలిగించుకొనినాఁడు. అంజలి బంధముగావించి కృతిభిక్షకొఱకు నిరీక్షించు సర్వజ్ఞసింగభూపాలుని యౌదార్యమును దిరస్కరించి శ్రీ కైవల్యపదంబుఁ జేరుటకు భాగవతము శ్రీ రామాంకితము గావించినాఁడు. జీవితమంతయు సాటిలేని సంతుష్టితో గడఁపుచు ఘోరతరమగు దరిద్రబాధకు దాసుఁడైనాఁడు. దైవదత్తమగు కవితాశక్తి దైవసమర్పణ గావించుటయే "పరమార్థ" మను రహస్యమును లోకమునకు ముక్తకంఠముగఁ జాటినవాఁడు పోతన. ఈ త్యాగమే యనంతరము గల కవులకుఁ జాలవఱకు మార్గదర్శక మయ్యెను.

4. పోతన కాలమున ఆంధ్రదేశస్థితి మిగుల శోచ్యావస్థలో నుండెను. ఆంధ్రవాఙ్మయ సేవకు సర్వస్వము ధారవోసిన చాళుక్య చోళరాజ్యము లంతరించెను. కవితకు, శిల్పములకు, జాతీయతకు, లలితకళావిలసనమునకు మార్గదర్శకమగు కాకతీయ సామ్రాజ్యము ఛిన్నభిన్నమయ్యెను. ఆర్యధర్మము లుప్తప్రాయము లయ్యెను. రాచకొండ, ఆనెగొంది, అద్దంకి మున్నగు తావుల రాజప్రతినిధులును వారి వంశజులును చెదరిన యాంధ్ర సామ్రాజ్యమును శకలములు చేసికొని నిరంకుశముగఁ బాలించుచుండిరి. ఈ విషమ పరిస్థితిలో సర్వవిద్యా సనాథుఁడు, కవిసార్వభౌముఁడునగు శ్రీనాథకవి దేశదేశములుతిరుగవలసివచ్చినది. స్తోత్రపాఠ ప్రియులగు రాజులనెందఱ నాశ్రయించినను నాతని యవసరములు ముగియలేదు. శ్రీశైలములోని భిక్షావృత్తి మఠముతోడను, అవచితిప్పయ్యసెట్టితోడనుగూడఁ గృతిబాంధవ్యము నెఱపుకొనవలసి వచ్చినది. ఆధ్యాత్మికచింతతోఁ బరమార్థసంగ్రహ దీక్షతోఁ బవిత్ర జీవితమునకుఁ ద్రోవ తీయుచున్న బమ్మెరపోతరాజు రాజాశ్రయము రోసి రామభక్తుఁడై ఈ కాలముననే జీవితమున కొక నూతనమార్గము నన్వేషింపఁగలిగినాఁడు.

5 పోతరాజు భాగవత రచనమునకు దొరకొన్నది కైవల్య ప్రాప్తికి; కోరిన ఫలము భవబంధ విముక్తి. కాని అడుగడుగునకు భాగవత రచనా ప్రయత్న మాతని హృదయమును సంక్షుభితము గావించి నట్లు గొన్ని సూచనలు కలవు. భారతిని "పురాణము తెలుఁగింప నెంచితిని. తత్సరణిం బ్రసాదింపుము. సాహసమును మన్నింపుము. దయాంభోనిధీ!" యని కేలొగ్గి ప్రార్థించినాఁడు. పూర్వకవులనేగాక సమకాలిక కవులను, భావికవులనుగూడ సంస్మరించినాఁడు. ఇంతలోఁ జంద్రగ్రహణము, గంగా స్నానము, శ్రీరామసాక్షాత్కారము, భాగవత రచనానుజ్ఞ, ఏకశిలానగరవాసులు భగవదాజ్ఞ విని భాగవతాంధ్రీకరణమునకుఁ బ్రోత్సహించుట జరిగినవి. ఈ సందర్భమునఁ బోతనామాత్యుని స్వగత మెంతేని తనివిదీర మననముఁ జేయఁదగినది.

క. "పలికెడిది భాగవతమఁట
పలికించెడివాఁడు రామభద్రుం డఁట నే
పలికిన భవహర మగునఁట
పలికెద వేఱొండుగాథ పలుకఁగనేలా

ఆ. వె. భాగవతము తెలిసి పలుకుట కష్టంబు
శూలికైనఁ దమ్మిచూలికైన
విబుధ జనుల వలన విన్నంతఁ గన్నంతఁ
దెలియవచ్చినంతఁ దేటపఱుతు."

6. స్వప్రయోజకత్వము లేకయే భాగవతమును శ్రీరామచంద్రుఁడు పలికించు చుండెనని పోతన దలంచినాఁడు. భాగవతము తత్త్వగ్రంథమనియు భావగ్రహణ మసాధ్యమనియుఁ బండిత సాహచర్యమునఁ దాను తొలుత గ్రహించిన దానినే పోతన చెప్పసాగెననియుఁ దెలియుచున్నది.

7. పోతరాజు ఓరుగల్లుప్రాంత నివాసి. ఆతని కాలమునందు శైవమతము మిగుల వ్యాప్తిగ నుండెను. పోతరాజు తండ్రి కేసన దానమాన నీతి ధనుఁడు, బహుకళానిధి. శైవశాస్త్ర విజ్ఞాత. తల్లి

యగు లక్కాంబ పాతివ్రత్యశోభితయేగాదు "సదాశివ పాదయుగార్చనానుకంపానయవాగ్భవాని" కావుననే పోతరాజు వంశ పరంపరాగత మగు శైవమతాభిమానమును వీరభద్ర విజయమునందు వెల్లడించినాఁడు. భాగవత రచనమున నీతఁ డద్వైత మతాభిమానిగ మారినాఁడు. అనంతర మీతని వంశజులు విశిష్టాద్వైత మతప్రవిష్టులైరి. నిజాము రాష్ట్రమునఁగల నియోగులు శ్రీ వైష్ణవత్వము స్వీకరించి గోలకొండ వ్యాపారు లనఁబడుచున్నారు. గోలకొండ వ్యాపారులు వేఱు. నియోగులు వేఱని (శ్రీ) వీరేశలింగము పంతులువారు తలంచిరిగాని యది పొరపాటు.

8. పోతరాజునకు సర్వజ్ఞసింగభూపాలుఁడు, పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు, అనంతామాత్యుఁడు, దగ్గుపల్లి దుగ్గన మున్నగు విద్వత్కవులు సమకాలికులు. నాచన సోమనాథుఁ డించుక పూర్వుఁడు. భాస్కరరామాయణము పరిసరభూములలోఁ జనించిన ప్రసిద్ధగ్రంథము. అంత్యనియమమునందుఁ బోతన భాస్కరరామాయణ పద్యముల నాదర్శముగఁ గైకొనినాఁడు. కొన్ని యెడలఁ బద్యగమనమునను సత్యభామా సంగ్రామమునఁ బూర్తిగ ఉత్తరహరివంశమును ననుకరించినాడు. మొత్తముమీఁదఁ బోతనకవిత స్వాతంత్ర్యభావవిలసితము. చాలవఱకు మూలానుసారము. అట్లయ్యుఁ గల్పనములు నూత్నములు. పోతన కాలమున ఆంధ్రులకు జాను దెలుఁగు కవితయందును గొందఱకు మిశ్రకవితయందును గొందఱకు దీర్ఘసంస్కృత సమాసకవితయందును నాదర ముండెడిది. సర్వజన సమ్మతమగు నీ మూఁడు గుణముల నలవఱచుకొనినఁగాని తన ప్రయత్నము ఫలవంతము గాఁజాలదని పోతన తలంచినాఁడు. అందుల కనుకూలముగఁ గవిత నీ త్రిమార్గముల నడపించుటయేగాదు, ఈ క్రిందివిధముగఁ బ్రతిజ్ఞ సైతము కృత్యారంభమున పోతన యొనర్చెను.

క. "కొందఱకుఁ దెనుఁగు గుణమగు
గొందఱకున్ సంస్కృతంబు గుణమగు రెండున్

గొండఱకు గుణములగు నే
నండఱి మెప్పింతుఁ గృతుల నయ్యైయెడలన్."

9. ఈ ప్రతిజ్ఞ ఎంతవఱకుఁ బోతరాజు జయప్రదముగా నిర్వహించెనో తెలిసికొనవలయునన్న ఏ గ్రంథమును జూచినను జాలును. భాగవత మాంధ్రదేశమున సర్వజన సమ్మతముగ నాదరింపఁబడుటయే యిందులకుఁ దార్కాణము. దీర్ఘసమాసము గల సంస్కృతరచనమున కుదాహరణముగ నొక్క పద్యమును దీసికొందము.

సీ. "కఠిన సటాచ్ఛటోత్కట జాలపాతని
ర్ధూత జీమూత సంఘాత మగుచు
ఖరని ఘసునిశిత ఖురపుటాహతచల
త్ఫణిరాజ దిగ్గజ ప్రచయమగుచు
చండ దంష్ట్రోద్ధ వైశ్వానరార్చిస్స్రవ
ద్రజత హేమాద్రి విస్రంభమగుచు
ఘోరగంభీర ఘుర్ఘురభూరిస్వన
పంకిలాఖిలవార్ధి సంకులముగ..."

తృ. స్కం. 412.

అచ్చ తెనుఁగురచనములు పోతనకు సహజమైనటులె తోఁచును. చిఱుత బాలురకేని యవగతము లగునట్లుండును.

"ఱెక్కలు రావు పిల్లలకు ఱేపటినుండియు మేఁత గానమిం
బొక్కుచు గూటిలో నెగసి పోవఁగనేరవు............"
"గుజ్జనగూండ్లను గొమరొప్ప వండించి
జెలులకుఁ బెట్టించుఁ జెలువు మెఱయ......"

10. మిశ్రకవిత్వమునకు భాగవతమునందలి ప్రతిభాగమున నుదాహరణములు లభించును. వెదుకఁ బనియుండదు. అరవిచ్చు మల్లెమొగ్గలవలె అరసినంతన విడివడు సమాసములు, ముద్దులమూట గట్టుపలుకు బొందికలు, అందచందముల హావణించు మృదురచనములు భాగవతమునఁ బ్రతి ఘట్టమునందును విరివిగా గోచరించుచుండును.

"బాలురచావు కర్ణములఁ బడ్డఁ గలంగి యలంగి యోరువం
జాలక బాష్పతోయకణజాలము చెక్కులఁగాఱ నేడ్చి పాం
చాల తనూజ నేలఁబడి జాలిబడం గని యెత్తి మంజు వా
చాలతఁ జూపుచున్ జికురజాలము దువ్వుచుఁ గ్రీడి యిట్లనున్."

11. పోతన కవితలోని గుణములు చెప్పుటకంటె భాగవతము పాఠకలోకమున కందించుటయె సుకరము. భక్తిచేఁ బోతన తన్మయుండై భగవంతుని నెంత వర్ణించినను దనివిసనఁడు. భగవద్భక్తులకుఁ గలిగిన పరమేశ్వర సందర్శనము వింతవింతపోకడలతో విన్నాణముగ వర్ణించును. రచనము కుంటువడదు. రసము తరుగదు. కల్పనముల కంతములేదు. పాఠకుల నొక్కమారు కథాప్రవాహమునఁ బడవేసి భక్తి రస ముగ్ధులఁ జేయుటలోఁ బోతరాజు అద్వితీయుఁడు.

12. పోతరాజు కవితలో ననిర్వాచ్యమగు నానందముకలిగించు నొక యద్వితీయశక్తిగలదు. అన్వయకాఠిన్య మాతని పద్యములలోఁ గానరాదనియే చెప్పవచ్చును. దుష్కరప్రాసములు, అంత్యనియమములు, అనుప్రాసములు, యమకములు నిరర్గళముగ నడచుచుండును. సాధారణముగ సరసయతినే వాడుచుండును. పదమధ్యవర్ణములు యతిప్రాసములలో నిమిడ్చి ధారకుఁ జిక్కదనము గలిగించుట యాతఁ డెఱుంగఁడు. అందుచే స్వల్పమగు భాషాపరిచయము గలవాఁడేని భాగవతమును ధారాళముగఁ జదువఁగలుగును. భగవద్వర్ణనమున నీతఁడు సగుణరూపమును ధ్యానదృష్టితోఁ దిలకించియే వర్ణించుచున్నాఁడా యని యనిపించును. పోకడలలోఁ గూడఁ గ్రొత్తదనము, ఆంధ్రీకరణమునందుఁ గూడ విన్నాణము, కథాంశమునందుఁ గూడఁ గవితాశిల్పము నెలకొల్పి పురాణమునఁ గావ్యలక్షణముల నిముడ్చుటలో నీతఁ డద్వితీయుఁడు. ఆంధ్రలోకమును భాగవతమువలె సర్వవిధముల నాకర్షించి యానందతరంగములపై నుయ్యేల లూగించు పొత్తమింకొకటి లేదు.

1. అర్థాదులు:- (పేరా 1) శ్రవణపుట పేయము= చెవులనెడి దొప్పలతోఁ ద్రాగఁదగినది. దొరకొనమిన్=ఆరంభింపక పోవుటచే. పురాణ+ఆవళి= పురాణముల సమూహము. పురాణములు పదునెనిమిది. భారత మా పదునెని

మిదింటిలోఁ జేరదు. కాని యిచట భారతము కూడఁ బురాణముగాఁ జేర్పఁబడినది. (పే. 3) అంజలి బంధము గావించి=దోసిలియొగ్గి (నమస్కరించి) ముక్త కంఠముగ=గొంతెత్తి. (పే. 5) కైవల్యప్రాప్తి=మోక్షమును బొందుట. భవబంధ విముక్తి=సంసారబంధమును విడుచుట. తమ్మిచూలి=పద్మమునుండి పుట్టినవాఁడు. (బ్రహ్మ) (పే. 11) విన్నాణము=నేర్పు. (ప్ర) విజ్ఞానము.

2. ప్రశ్నలు:-

1. ఎఱ్ఱన యెట్లు ప్రబంధ పరమేశ్వరుఁడాయెను ?
2. నన్నెచోడుని గొప్పతనమేమి ?
3. పోతన, నన్నయాదులు భాగవతమును తెనిఁగింపకుండుట నెట్లు గాఁదలపోసెను?
4. రాజాశ్రయమున కారంభించిన కవి యెవరు ?
5. పోతన కవిలోకమున కే విషయమును జాటి చెప్పెను ?
6. "పోతనకాలమున ఆంధ్రదేశస్థితి మిగుల శోచ్యావస్థలో నుండెను" ఎట్లో వివరింపుఁడి.
7. పోతన భాగవతరచన కెట్లు కడంగెను ?
8. పోతనలోని శైవమతాభిమాన మెట్లు వెల్లడియయ్యెను ?
9. గోలకొండ వ్యాపారులన నెవరు ?
10. పోతనకు సమకాలికులైన కవు లెవరు ?
11. పోతన యెవ్వరెవ్వరి కవిత్వముల నాదర్శములుగఁ దీసికొనెను? ఏవిషయమున?
12. పోతన కృత్యారంభమున నొనరించిన ప్రతిజ్ఞ యేమి ?
13. స్వల్పభాషాజ్ఞానము కలవారు సైతము భాగవతమును సులభముగాఁ జదువఁగలుగుట కేమి కారణము ?

3. రచన:-(1) పోతన రచనలోని విశిష్టతనుగూర్చి రెండు పరిచ్ఛేదములు వ్రాయుఁడి. (2) పోతన జీవితమందలి గొప్పతనమును వివరింపుఁడి.

4. వ్యాకరణాంశములు:- ఈ క్రింది ద్రుత సంధులను జేసి యన్ని రూపములను జూపుఁడి.

పరమేశ్వరార్పణముగన్+కావ్యఫలము.
నన్నయభట్టారకునితోన్+కవులకు
సమ్మెటప్రేటులన్+తినుట
సాహచర్యమునన్+తాను
కవులకున్+చాలవఱకు
ఇంతలోన్+చంద్రగ్రహణము
ఆంధ్రీకరణమునకున్+ప్రోత్సహించెను.
కొన్నియెడలన్+పద్యములు.

# ౪. ఇందీవరాక్షుఁడు

## శ్రీ పులిగడ్డ వెంకటసుబ్బారావు

ఈ కథాభాగము 'మధుకణములు' అను పుస్తకములోనిది. ఆ పుస్తకము మధురములగు కథల సంపుటి. ప్రకృత కథాంశ మాంధ్రకవితాపితామహుని మను చరిత్రము నుండి గ్రహింపఁబడినది.

సుబ్బారావుగారు తెనాలి నగరమందలి తాలూకా హైస్కూలునం దాంధ్రోపాధ్యాయులుగా నున్నారు. ప్రత్యూషము, కల్హారము. స్వర్ణప్రతిమ మున్నగునవి వీరి యితర రచనలు. వీరి రచనలు. విద్యార్థిలోకమునకు మిగుల నుపయోగ పడుచుండును.

1. సుధాగ్రహణ లాలసులై కలశపాథోనిధినిఁ ద్రచ్చఁబూనిన సురాసురులకుఁ బ్రధానసాధనమైన తరిగొండపై నొక గంధర్వనగరము గలదు. ఆ పట్టినమందలి ప్రాసాద శిఖరములు నిక్కి యాకసము నంటుచుండును. మాతంగ తురంగ పంక్తులచే గహనములై యుండు విపణి వీథులందలి నవరత్న దీధితులు గ్రహరాజు కిరణజాలమును బరిహాసించుచుండును. అందలి గంధర్వులెల్ల వేళలందును దంత్రీస్వన సమ్మిశ్రిత కంఠములతో లక్ష్మీనారాయణుల నుతించుచుందురు. ఆ దివ్యనగరమును నలనాభుని తనయుండగు నిందీవరాక్షుఁడను గంధర్వపతి సురరాజవైభవముతోఁ బాలించుచుండెను.

2 ఆ గంధర్వపతి యొకనాఁ డందందు సంచరించుచు బ్రహ్మమిత్రుండను ముని యాశ్రమమును బ్రవేశించెను. అటనా జటివరుండు గంటవట్టి నిలుకొని రేయింబవళులను నిజశిష్య గణమునకు నాయుర్వేదమును బోధించుచుంటను గాంచి, తానును నావిద్య నభ్యసింప మనసుపడెను. పిదప నామునికి సాష్టాంగ మెఱఁగి "దేవా! నన్నును మీయంతేవాసులలో నొక్కనిగాఁ దలఁచి నాకును నీ వైద్యశాస్త్రముపదేశించి నన్ను ధన్యుంగావింపుఁ" డని సవినయముగాఁ బ్రార్థించెను.

3. అదియెట్టి పాపపు వేళయోగాని యా వెజ్జులయొజ్జ గంధర్వరాజు విన్నపము నంగీకరింపక "ఓయీ! నటగాయకాదుల వచశ్శ్రీధురసము నాను నీ చెవుల కీశాస్త్రము కటువుగా నుండును. నీ కిదియేల! నిన్నుఁ జదివింపకున్న మాకును జరుగనిదిలేదు. వచ్చినదారింబొ"మ్మని కసరెను. అంతలో నిరుత్సాహము నొందక యిందీవరాక్షుఁడు దోయిలి ఘటించి "యాచార్యా! నన్ను గంధర్వ మాత్రునిగాఁ

దలంపకుఁడు. మిమ్ముఁబోలు పెద్దల నాశ్రయించి వసలీనవాఁడన్, నా కాంక్షను ద్రోసివేయక మన్నింపుఁ" డని మఱిమఱి వేఁడ నా జటి రుసరుసలాడుచు "చాలు! చాలు! ధన రాజ్యాదిమహామదమునఁ గనుఁగానని మిముఁబోఁట్ల శిష్యులుగాఁ గొనుటకంటె నొంను నేరమిం కలదంమవా? నన్నారక కంపింపక క్రచ్చటఁ బోవాలు" మని ప్రూల నాడఁగా నిందీవరాక్షుండు గరము రోషించియుఁ జికిత్సకు విద్వేషించుట తగవుకాదని యించుక శమియించి "బేలతపసీ! నీవు చదివింత్వు, వని మా యైశ్వర్యములను దిగనాడుకొని బిచ్చమెత్తఁగలమా! నీకును నీ వెఱ్ఱిఁదనమునకును వేయి దండము" లని యచ్చటు కదలి పోయెను.

4. ఇందీవరాక్షుని మానసమునఁ గలఁత తీఱలేదు. "ఔరా! యీ జడదారి యెన్ని కారులాడెను! వీరందఱును వైద్యవిద్యకుఁ బాత్రులై నేనుగానైతిని గాఁబోలు! నాకు నీ వైద్య మెట్లబ్బదో చూచెదనుగాక!'' యని తలంచి తన శాంబరీ విద్యాప్రభావంబునఁ గపటరూపమున ఛాత్రవర్గమునఁ జేరి యెనిమిది మాసంబులలో వైద్య శాస్త్ర మర్మములనెల్ల గ్రహించెను. అంతతోఁ బోక కర్మాధీనమానసుఁడై యావిప్రుని యెదుటికేగి యిట్లు పరిహసించెను.

"తండ్రీ! నాకు నను గ్రహింపఁగదే వైద్యమంచుఁ బ్రార్థించినన్
గండ్రల్ గానటులాడి ధిక్కృతులఁ బోకాల్మంటివో హా మదిం
దీండ్రల్ గల్గినవారి కేకరణి నేనిన్ విద్య రాకుండునే
గుండ్రాడాఁచినఁ బెండ్లి యేమిటికిఁ జిక్కుం గష్టముప్టింపచా!"

5. ఆమాటల కదిరిపడి యాజటి కటంబులదర పండ్లుపటపట గీటుచు "నోయీ! నీవా సురమాయ నుపయోగించి మా విద్యను గ్రహించితివి. కాన నీ వసురవై రక్తమాంసంబు లశనంబుగాఁ బుడమిపై వసియింపు" మని శపియించెను. రూక్షమ్ములగు నా శాపాక్షరమ్ములు గుండె నగలింప నిందీవరాక్షుండు వడవడ వణంకుచు మునిపాదములపైఁబడి మన్నింప వేఁడుకొనెను.

6. తృణవహ్నికల్పమగు కోపము శమింప మునినాథుఁ డార్ద్రహృదయుండై యిందీవరాక్షునిఁ గ్రుచ్చియెత్తి 'అయినదాయెను.

నీవు నసురరూపమునఁ గొంతకాలము సంచరించి నీ తనయనే మ్రింగ వెనుకొని యొక ధన్యుని దివ్యశరార్చిం బ్రేలి మగుడ నీ రూపము నందుదు” వని యనుగ్రహించెను.

7. ఇందీవరాక్షుఁడు గఱచిన దానికి లజ్జించుచు వెనుకకు నిశ్శ్వాసములతో స్వనగరమున కేగెను. నగరమును జేరుచుండఁగనే యతనియం దాసురభావములు చేరసాగెను. పార్శ్వచరులపైఁ గోర కొఱలాడుచుఁ జెడఁదిట్టి పాఱఁద్రోలెను. అంతిపురమును చేరగనే నివ్వాళు లెత్తవచ్చిన యంగనలను గశాఘాతంబులచే నడిపించెను. అతని చేష్టల కైనవారందఱు వింతపడసాగిరి.

8. క్రమముగా నా గంధర్వ విభునకుఁ దన దేహ మభ్ర మండలము వఱకును బెరిగినదనిపింపసాగెను; లోకాలోక పర్వతముల వఱకుఁ బఱచుచున్నట్లు తోఁచుచుండెను. బ్రహ్మలోకమున కెగిరినట్లును, పాతాళమునఁ గ్రుంగినట్లును బొడగట్టెను. లోకములనెల్లఁ గబళింపఁ దగినయాఁకలి చెలఁగెను. సముద్రములనెల్ల గుటగుటం ద్రావఁజాలిన దప్పివొడమెను. కొండలఁబట్టి యుఱ్ఱూఁతలూఁపఁ జాలిన క్రొవ్వుకలిగెను. అప్పుడాతనికిఁ గంటఁబడినవారెల్ల నేదో యపరాధ మొనరించిన వారుగనే కాన్పింపసాగిరి; అపరాధులుగాఁ దోఁచిన వారెల్ల నాఁకటి చిచ్చు కాహుతి కాసాఁగిరి. అచిరకాలముననే యాతని ప్రోలు ప్రాణిసంచార శూన్యమాయెను. అతని యిల్లాలుత్సవములు చూచునెపమునఁ గూఁతుతోఁ గూడఁ దన తండ్రియింటినిఁ జేరి ప్రాణత్రాణము కావించుకొనెను.

9. అంతనయ్యసురయు మదోన్మత్తుఁడై వికృతరూపమునుదాల్చి, సర్వస్వమును మఱచి కంటఁ బడిన సత్త్వముల నెల్ల నోటవేసికొనుచు నొకనాఁడు ధవళగిరి సానువులను గ్రుమ్మరుచు నటఁ బుష్పాపచయ మొనరించుచున్న తనపుత్త్రియగు మనోరమనుగాంచి నందనయను నెఱుక లేక యామెను గబళింప నుంకించెను. ఆహరిణాక్షియు దావానలంబు పగిది తన్నాయసుర వెంటాడుచుండ వాసరత్రయం బరణ్య రోదనం బొనరించుచు బఱవసాగెను. తనపాలి భాగ్యదేవతవోలె మృగయాసక్తుఁడై యక్కాన కేతెంచిన స్వరోచి యామెయార్తధ్వని నాల

కించి చేరఁబోయి యామె వృత్తాంతమునెల్ల నాలకించి యామెకభయ మొసంగెను.

10. ఇంతలో నా పాలడిండియు దావవహ్నివలె నేతెంచి స్వరోచి నెదిరించెను. అంత నయ్యిరువురును బెద్దతడవు పోరుసలిపిరి. తుదకు స్వరోచి కోపోదగ్రుఁడై పావకాస్త్రమును బ్రయోగింప నాదివ్య శరవహ్ని యా యసురను గప్పివైచెను. తోడనే యాపిశితాశి గంధర్వ రూపమునుధరించి స్వరోచికి నయనానందమును గూర్చెను. ఇంతలో మనోరమయుఁ దన తండ్రినిగాంచి పఱుగుపఱుగునఁబోయి యాతని యడుగుల వ్రాలెను. ఇది యంతయుఁగాంచి రిచ్చవడియున్న స్వరోచి కిందీవరాక్షుఁడు తనవృత్తాంత మంతయుఁ దెలిపి, యాబాల, తన పుత్రియగుటయు, స్వరోచియుఁ దన యక్కయగు వరూధినీ నందనుం డగుటచేఁ దనకు మేనల్లుఁడగుటయు నెఱింగించెను.

11. ఇందీవరాక్షుఁడు తనకుఁ బూర్వరూపమును బ్రసాదించిన స్వరోచిని మిగుల నగ్గించి తన కూఁతు నొసంగి పరిణయ మొనరించి తన నేర్చిన యాయుర్వేదంబును గట్నంబుగా నొసఁగెను.

1. అర్థాదులు:– (1 పే) పత్తనము=పట్టణము. తంత్రీస్వన సమ్మిశ్రిత కంఠములు=వీణా నాదముతోఁ జక్కఁగాఁ గలుపఁబడిన కంఠధ్వనులు. (3) శీధు రసము=చెఱకురసముతోఁ జేసిన మద్యము జటి=జడలుకలవాఁడు (ముని). పాకా లుము=పాము. (4) శాంబరీవిద్య=మాయనుగల్పించు విద్య. గండ్రక్ + కాన్= కఠినములుగా. కష్టపెట్టింపచా=నీవుండవకు బిచ్చగాఁడా ! (6) శర+అర్చి = బాణజ్వాల. (8) అభ్రమండలము=మేఘమండలము. (9) ధవళగిరి సానువులు = కైలాసపర్వతపు చఱియలు. పుష్ప+అపచయము=పూవులు గోయుట. (10) పిశితాశి=మాంసమును దినువాఁడు (రక్కసుఁడు)

2. ప్రశ్నలు:– 1. ఇందీవరాక్షుఁడు బహ్మమిత్రు నేమని వేఁడెను? 2. ఇందీవరాక్షునకు రాక్షసరూప మేల కలిగెను? 3. ఇందీవరాక్షుఁడు రాక్ష... యేమి చేసెను? 4. ఇందీవరాక్షునికి రాక్షసరూప మెట్లు తొలఁగెను?

3. రచన:– 1. ఇందీవరాక్ష బ్రహ్మమిత్రుల సంభాషణను విస్తరించి వ్రాయుము. 2. ఇందీవరాక్షునికథ నాతని మాటలలో వ్రాయుము.

4. వ్యాకరణాంశములు:– కర్మాధీనము-దిక్కృతులు-వచశ్శీధురసము-కోపోదగ్రుఁడు – ఈ సంధులను వేర్పఱచి సంధినామములఁ బేర్కొనుము.

భారతీ ప్రెస్, తెనాలి.